తలలు నజీకిపై తుఁ దలఁకక మీా కెందుఁ
బోవఁదరము మందబుద్ధులార. 69

ఉ. ఎవ్వఁడు నిర్దయాత్ముఁ డగు
నెవ్వఁ డకార్యము కార్యముం గనం
డెవ్వఁడు క్రోధవంతుఁ డగు
నెప్పుడు; నాపదముట్టినట్టిచో
నెవ్వఁ డుపాయశూన్యమతి
నిద్ధమదోద్ధతి నుండు నట్టివాఁ
డెవ్విధి సౌఖ్యసిద్ధిఁ గను
నెట్లు సమంజసవృత్తియై చనున్. 70

చ. తనకును దాన మిత్రుఁ డగు
దాన యమిత్రుఁ డగుం దలంపఁగా
దనుఁ దరియింపఁజేయ నగుఁ
దాన విచక్షణుఁ డేయుపాయవ
ర్తనమున నైనఁ గావునఁ ది
రంబుగ నా కుపదేశ మిచ్చి మీా
రెనయఁగ నివ్విపత్తిఁ దరి
యింపుఁడు భూసురులార పెంపునన్. 71

క. అని చోరుఁ డిట్లు పలికిన
విని నృపతరుణుఁడు సర్వవిద్యానిధి యీా

యన మసల మనుపఁగలఁ డని
మును లతిభీతి న్వసిష్ఠమునివెనుకఁ జొరన్. 72

వ. అప్పుడు మునిశ్రేష్ఠుం డగువసిష్ఠుం డొక్కసూక్ష్మబుద్ధి యవలంబించి వెండియుఁ జోరున కి ట్లనియె. 73

క. చేసెద నుపదేశము నీ
కాసద్గతి జాఱవిడిచి యట వెండియు నీ
వాసురగతిఁ జోరత్వము
చేసిన నయ్యఘము నన్నుఁ జెందుం బిదపన్. 74

క. క్షితిజనకృతదురితము భూ
పతిఁ జెందున్ నృపతిచేయుపాతకము పురో
హితుఁ జెందున్ సతికలుషము
పతిఁ జెందుం జెందు శిష్యపాపము గురునిన్. 75

క. పర మిచ్ఛయించుమనుజుఁడు
పారి సత్యవ్రతముఁ బూని భూతదయాంభా
సురశాంతిదాంతియుతుఁ డై
పరహింస యొనర్ప మాని ప్రౌఢి మనఁదగున్. 76

క. క్రూరత్వము దుర్వృత్తియు
నారయఁ బరహింస కోప మత్యాశయు దు
ర్వారపిశునత్వదుష్టా
చారంబులు విడువవలయు జాపకులు ధరన్. 77

తే. దమము శమమును భూతహితంబు గల్గు
నట్టివారలు మంత్రిసేవాధికారు
లీవు తస్కరుఁడవు దయాహీనమతివి
వంచకతఁ బెట్టి మంత్రి మీవలయు నీకు. 78

ఉ. నా విని వాఁడు పల్కె ముని
నాయక చోరుఁడ నంచు న స్వరీ
భావ మొనర్చి యిక్కరణిఁ
బల్కఁగ నేఁటికిఁ జిత్తగింపు నా
భావ మచంచలత్వమునఁ
బాటిలె భక్తియు నుద్భవించె నీ
సేవ యొనర్చువాఁడ నను
శిష్యునిఁగాఁగఁ బరిగ్రహింపవే. 79

క. చోరులకుం జారులకుం
గ్రూరులకు శరారులకును గురుతరమహిమన్
వైరాగ్య మబ్బెనేనియు
వారలకు స్మరల విషయవాంఛ యొదవునే. 80

క. వైరాగ్యం బుదయింపని
వారలు కైవల్యధర్మవర్తను లైనన్
నూఱేఁడుల కేనియు నని
వారణఁ దత్కార్యసిద్ధి వఱలంగలదే. 81

ఉ. తద్దయు వీతరాగుఁ డగు
ధార్మికశిష్యుఁడు దేశికేంద్రుఁ డు
ద్యద్దయ నిచ్చుమంత్రమున
కర్హుఁ డగుం దలపోయ నంత న
య్యుద్దఱయోగ్యతాఫలస
మృద్ధికతంబున నమ్మనూత్తమం
బుద్దవిడిఁ న్మనోరథము
లూర్జితలీల ఘటించుఁ బ్రొద్ధిమై. 82

క. తలఁపులఁ గోరిక లూరం
బలుకుల వైరాగ్య మెలయఁ బలుకుచుఁ బరులం
బలుమఱు బోధింపుదు రె
వ్వలనన్ దుర్మార్గవృత్తి వంచకులు ధరన్. 83

క. లో విషయలంపటత వా
చావిధి నిస్పృహత బెరయ సారెకు మాయా
పావీణ్యుఁ డగుచు నోరుల ధ
నావళి నొడిచికొను నధమహర్త కుఁడెందున్. 84

తే. వేదశాస్త్రపురాణార్థవిదుఁడు గాక
యనయవర్తన క్షుద్రవిద్యాబలమున
మెలఁగు దాంభికువేషభాషలకుఁ జొక్కి
పూజ నొనరించు ననయంబు భువి జనంబు. 85

క. కావున మంత్రి మొసఁగి ననుఁ
గావు మహీదేవ దుఃఖకంథకిఁ దరివై
నీ విత్తఱిఁ గరుణామతి
నా విని యమ్మౌని చోరునకు నిట్లనియెన్. 86

సీ. మంత్రిజాపకు లైనమహితాత్ము లనిశంబు
వలనొప్ప నియమంబు వలయుఁ జేయ
ధర నుపాసకుల కెందఱకును నియమంబు
వెలిగ శ్రేయఃప్రాప్తి వెలయఁగలదె
నిజవర్ణసముచితనియమంబు సలుపక
యన్యకర్మావాప్తి నలరునట్టి
యవనీసురక్షత్రియార్యపర్యులకుఁ ద
త్ఫలసిద్ధి యొనర జేపట్ట నయిన

తే. నిత్యకర్మఫలంబున నిఖిలకర్మ
సిద్ధి యగు సర్వసంపత్సమృద్ధి యొదవు
నట్లు గావున సత్కర్మ మాచరింప
వలయు వాంఛితసిద్ధి గావలయునేని. 87

తే. ఆయురారోగ్యకీర్తుల నతిశయిల్లు
జగతి నాచారవంతుఁ డాచారదూరుఁ
డఖిలజననిందితుం డగు నాయు వణఁగి
నిరయసంవాసి యగు నిది నిక్కువంబు. 88

ఆ. గురునియాజ్ఞ దాఁటుకుమతికి నిష్కృతి
లేదు గాని యోమలిమ్లుచాథ్య
యెట్టిదురితచరితుఁ డేని సదాచార
గరిమకతనఁ దొలఁచుఁ గలుషసమితి. 89

క. నీచాత్మకుఁ డేనియును స
మీచీనశ్రద్ధ గలిగి మెలఁగుచు ననసూ
యాచాతురి నెలకొనఁగ స
దాచారము సల్పి మను శతాబ్దము లుర్విన్. 90

వ. అనినఁ జోరుం డిట్లనియె. 91

ఆ. నీయధీను లగుచు నీదిక్కుఁ జూచుచు
నున్న యిమ్మునీంద్రు లోపి మంత్రి
మొసఁగలేరు నీవహో మహాబుద్ధివి
నను గటాక్షదృష్టిఁ గనఁగరాదె. 92

సీ. విద్యాపవీణులై వెలయు విప్రులకైన
నాపదతటిని మర్యాద గలదె
ధనతపోవ్యయమునఁ దారు ప్రాణము నిల్పి
వెనుక ధర్మ మొనర్చు టనువుగాదె
నిత్యసత్యవ్రతనిష్ఠ యైనను మాని
ప్రాణంబు రక్షించు టర్హసరణి
యటుగాక దుర్మరణావస్థ ఘటియిల్ల
నిరయసంవాసంబు నివ్వటిల్లు

తే. నాపదలఁ బండితుఁడు భీతి యపనయించి
విధినిషేధాదితర్కముల్ విడుపవలయుఁ
గాన నీకాన నాపద గదిరె మీకు
నెట్లయినఁ గడచనుఁడు మునీంద్రులార. 93

క. సారెఁ దనయూరఁ బూర్ణా
చారము పొరుగూర నందు సగముం బురిలో
నారయ నందు సగంబును
దారిఁ శూద్రగతి నడపఁ దగు ధీరాత్ముల్. 94

తే. ప్రాణసంశయవేళల బ్రాహ్మణుండు
మీఱి దుర్వృత్తిచే దురాచారసరణి
నింద్యకర్మంబు చేసియు నిందఁ బొందఁ
డంత నిష్కృతిఁ బూతాత్ముఁ డగుఁ దలంప. 95

క. ఈయడవి న్నిమముఁ గావఁగ
నాయతదోస్సత్వశాలి యగునరుఁ డొకరుం
డీయెడఁ గల్గునె యిదె మీ
యాయువు నాచేతఁ జిక్కె నని క్రోధమునన్. 96

ఆ. దండ మెత్తి వ్రేయఁ దమకించుటయు మునుల్
శత్రుమిత్రతతికి సములు గాన
నవ్వుకొనుచు నప్పు డవ్వసిష్ఠునిఁ గని
షలికె రుచితఘణితి వెలయ నిట్లు. 97

క. పులితెఱఁగునఁ గనలెడు నీ
ఖలుబారికిఁ దొలఁగి మనము గడచునుపాయం
బిల నెద్దియెదియొ యది కౌ
శలమున నొనరింపు మిపుడు సంయమివర్యా. 98

వ. అనిన విని వసిష్ఠముని తనమనంబున. 99

తే. ఘోరశార్దూలసంకులఘోరవనుల
నార్తివేళల రఘురాము నాత్మఁ దలఁప
వలయుఁ బో దాన నాపదల్ దలఁగిపోవుఁ
గమలబంధునిరాకఁ జీకటులుపోలె. 100

క. హరి నాత్మన్ భజియించిన
కరి బంధవిముక్తిఁ గని సుఖస్థితి నొందెన్
నరులు హరిఁ దలఁచి యాపద
తరియించుట యద్భుతంబె ధర నూహింపన్. 101

క్రౌంచపద. వారిదగాత్రు న్వారిజనేత్రున్
వనజజముఖసురవరనుతిపాత్రున్
దారితవైరిన్ స్వైరవిహారిన్
దశముఖముఖఖలదనుజవిదారిన్
సారసధామున్ శ్రీరఘురామున్
సరసిజహితకులజలనిధిసోమున్
సారె నుతింపం గ్రూరులకేనిన్
సమధికసుఖతతి సతతము నబ్బున్. 102

వ. అని తలంచి. 103

దండకము. శ్రీరామపాదారవిందద్వయీధ్యాన నిధ్యానసం
ధానసంధావిధాదక్షిణాక్షీణనాథిష్ఠనిష్ఠాగరిష్ఠాత్ముఁ డై
యువ్వాసిష్ఠుండు మందారకల్పద్రుమారామసీమప్రదేశం
బునన్ నూత్నరత్నావళీ * కల్పితైణాంకముక్తావితాన
ప్రతానస్ఫురత్తోరణోదార కృష్ణాగరూద్బుద్ధసంశుద్ధధూ
పాదిసంవాసనారామోగసాభోగసన్మంటపాంతస్స్థలిం జ్ఞోక
మై కైకయీపుత్త్ర శత్రుఘ్ను లత్యంత సాంతత్య
సౌభాగ్య సౌభ్రాత్ర సౌహార్ద్ర మొప్పార చామీకర
చ్ఛత్రముం జామరంబుం గరంబింపుమైఁ దాల్చి కొల్వన్
దశగ్రీవుతమ్ముండు సుగ్రీవుఁడున్ సాగ్రహవ్యగ్రనై జా
గ్రజ్జోదగ్రతానిగ్రహస్ఫూర్తియుం బ్రాజ్యతత్పూజ్య
సామ్రాజ్యదానోల్లసత్కీర్తియుం గీర్తనల్ చేసి సేవింపఁ
బాషాణవేషవ్యథాఖిన్నమౌనీంద్రసత్కోపనా♦శాపసంతాప
నిర్వాపణప్రౌఢసుశ్రీపదాంభోజ మంభోజసంభూతజంభారి
ముఖ్యామరశ్రేణు లాత్మీయకోటీరకోటీతటీకోణమాణి
క్యరేఖామయూఖాళిచే హాళిమీఱ న్నివాళింప సింహాస
నాసీనుఁ డై యున్న రాముస్ హరిద్రత్న దూర్వాంబు
దేందీవరశ్యాము మందారదామాభిరామున్ మహీభృ

---

* కల్పితైణాస్య, పాఠాం ♦ వాపసంతాప—వ్రా. ప్ర.

ల్లలామున్ ధనుర్బాణతూణీగదాశంఖచక్రాది నిర్వక్రి
దివ్యాయుధశ్రీకరు న్నాకవిద్వేషిహృద్భీకరుఁ హీర
మంజీర కేయూర కోటీర హారాది భూషావిశేషాన్వితున్
జ్ఞానముద్రాయుతు న్హారికాశ్మీరనీహారపాథోమిళచ్చారు
పాటీరచర్చాంచితాంగున్ రణాభంగు సౌమిత్రిసేవ్యున్
జగద్భావ్యు సామీరిహస్తద్వయన్యస్తపాదున్ సదా
మోదు నీరేజపత్త్రోల్లసల్లోచనున్ బంధనిర్మోచనుం
గోసలేంద్రాత్మజాగర్భశుక్తి ప్రభూతోరుముక్తామణిఁ
భక్తచింతామణిం బీతకౌశేయవాసు న్మహోద్యద్విలా
సుం జిదానందకందుం బ్రభు న్సర్వగుం గేవలుం జిన్మ
యుం జిత్స్వరూపి న్నిజస్వాంతవీథి న్విలోకించి కించిద్ధ్వని
న్సారకారుణ్యవిస్తారధారా సుధాపూర సంపూరితాపార
సత్సింధవే పారికాంక్షీశవిస్ఫారహృత్సారసోదారమోద
ప్రదోద్యజ్జగద్బంధవే విశ్వసంహారనిర్మాణరక్షాకళా
హేతవే ధర్మకర్మావళీసేతవే వైరిజైత్రాయ వారాశి
కాంచీతనూజాకళత్రాయ నిత్యాయ సత్యాయ నిశ్శ్రే
యసానందసందోహసంధాయినే స్వాశ్రితవ్రాతహృత్కామి
తార్థాళిసంస్థాయినే ఘోరపాపచ్ఛిదాదక్షకల్యాణనామ్నే
సహస్రాంశుసాహస్రమాంగళ్యధామ్నే రమాకామినీ
కామితాకారిణే దండకారణ్యసంచారిణే తే నమస్తే
నమస్తే నమో యంచుఁ గీర్తించుచున్ దన్మయత్వంబునం

జొక్కి రోమాంచసంఛన్నగాత్రుండు నానందబాష్పా
బుసంసిక్తనేత్రుండు నై యంత నారాఘవానుగ్రహా
హాపేక్షయుం జోరవరోపదేశాదికష్టజపంబై మరా యంచు
విత్తెంచుశబ్దంబు తూర్ణంబ కర్ణద్వయీగోచరం బైన
నవ్యామృదవాహాన్నిధిం దేలి యోలాడి యుమాత్మని ధ్యా
నోపరామస్థితిం బాహ్యలోకంబు వీక్షించి తానత్తఱిన్.104

తే. మునులఁ గని యిట్లు లనియె నోయనఘులార
రాఘవానుగ్రహమున మరా యటంచు
మంత్ర మొక్కటి వినసయ్యె మనకు నింక
నెద్ది కర్తవ్య మగుపని యెఱుఁగఁ జెప్పుఁడ. 105

వ. అనిన వార లిట్లనిరి. 106

మత్త. నీ వెఱుంగనియర్థ మెయ్యది నిర్మలాత్మక యాత్మసం
జీవనార్థ మకృత్య మైనను జేయఁగా నగు నిట్టిసం
భావితాత్మునియందుఁ జెందదు ప్రత్యవాయము మానవుం
డేవిధంబుననేనియుం దరియింపఁగాఁ దగు నాపదల్. 107

వ. కావున మనకు నియ్యాపద డలంగునట్లుగా రామానుగ్ర
హంబున నీచే శ్రుతంబైన మరా యను నక్షరద్వయంబు
వీనికి నుపదేశింపుము జ్ఞానం బానంబు లేదు వీఁడును
ముక్తుం డగు నని పల్కిన సమ్మతించి వసిష్ఠమునీం
ద్రుండు చోరునిం గరుణించి. 108

ఆ. చోర చోర రార సుగుణోత్తరుండవు
మంత్ర మొసఁగువాఁడ మసల కెపుడు
జపము చేసె దేని యపవర్గ మొదవు నీ
కనిన వాఁడు ప్రముదితాత్ముఁ డగుచు. 109

వ. నమస్కరించి యిట్లనియె. 110

తే. మౌనిపుంగవ మీకృపామహిమకతన
ననుఁ గృతార్థుఁ గావించితి రనఘ యిట్లు
హీనజాతుల నైన నహీనమతులు
కరుణ మనుపుదు రెపుడు నాగ్రహము లేక. 111

క. హిమకరుఁడు నహిమకరుఁడుం
దమకిరణప్రసరణమునఁ దమ మడఁపుదు రా
క్రమమున సజ్జనబృందము
విమలత లోకత్రయము పవిత్ర మొనర్చున్. 112

సీ. ఋషివరేణ్యులు మీర లే బుళిందకులుండ
నిట్లు న న్నేలితి రేమి చెప్ప
జని సఫలం బయ్యె సకలకల్మషములు
దలఁగె భవాంబుధి దాఁటఁ గంటి
నాకల్పమును యశం బలమి జగత్త్రయి
వఱలెద మీదయావైభవమున
కెయ్యది వలయు మీ కే నది యిచ్చెద
సాధించి నాకు నసాధ్య మెద్ది

తే. నాదుమనమున ఘనువ్రుఁ బ్రాణంబు నీయ
క్షేమములు నీపదాంబుజధ్యానకలన
నెలకొనియెఁ జిత్తవృత్తి వినిర్మలత్వ
గరిమఁ గాంచితిఁ దిర మెప్ప గురులలామ. 113

సీ. గురుదర్శనంబును గురునమస్కృతియును
దురితసంఘంబులఁ దొలఁగఁజేయు
గురువాక్యశ్రవణంబు గురుభక్తియుక్తియు
నల్పతిస్థలం బనఁగరాదు
గురుపాదతరణిచేఁ దరియింపుమరు తత్త్వ
సంవిదుల్ సంసారసాగరంబు
గురుపదధ్యానంబు గురుపూజనమును సం
పద లొసర్చును నాపద లడంచు

తే. గురుఁడె బ్రహ్మంబు విత్తంబు గురుఁడె తత్త్వ
మతని మించిన పరతత్త్వ మవలఁ గలదె
యట్లు గావున గురుపూజ యాచరింప
నర్హ మగు నందు రేయుపాయమునకైన. 114

క. గురువర నీసత్కరుణా
గరిమఁ భవసాగరంబు గడచెద మును సా
గరతరణం బొనరించిన
హరిసేవకుఁడైన హనుమ యను కపిరీతిఁ.. 115

వ. అనిన విని వసిష్ఠుండు తనమనంబున నిట్లని వితర్కించె. 116

చ. ధనహరణార్థబుద్ధి యగు
తస్కరుఁ డీగతిఁ బల్కువాఁడె సొం
పున మునిరీతి వీనిమదిఁ
బూని విరక్తిఁ జనింపఁబోలు నె
మ్మనమున నున్నచందములు
మాటలచే నెఱుఁగంగఁ బాడి యీ
ఘనుఁ డుపదేశపాత్రుఁ డగుఁ
గామితసిద్ధియు నబ్బు వీనికిన్. 117

క. పాపాత్ములకుం బశ్చా
త్తాపం బుదయించెనేని తత్పాపంబుల్
రూపఱుఁ జిత్తము విమలతఁ
బ్రాపించు ననారతంబు భద్రము లొదవున్. 118

వ. అని వెండియు. 119

తే. ఇదియు మాయావిరక్తియో యెఱుఁగరాదు
ప్రాణిహింసకులకు దుస్స్వభావులకును
వంచకులకును దుర్మార్గవర్తులకును
గార్యసంసిద్ధిచే మాయ గలుగు నండ్రు. 120

క. ధర దుష్టజనులశిష్టత
యొరులకు నొప్పమియ సేయ నొనరుం బులి తా
నిరవొంద నుపవసించుట
స్థిరతరపశుహింసనంబు సేయన కాదే. 121

వ. అయ్యవను శిష్యునకు సదుపదేశంబు సేయుదు నని తలంచుసమ
యంబున. 122

సీ. అలరుచు నీరఁ గ్రుంకి శుచి
యై జలపాత్రము కేలఁబట్టి వ
ల్కలములు గట్టి తస్కరుఁ డ
ఖండపవిరక్తి దలిర్పఁగా నచం
చలమతిమంతుఁడై పరగి
సద్గురుచంద్రున కయ్యెడన్ సమి
త్ఫలకుశముఖ్యవస్తువు లు
పాయన మిచ్చె సభక్తికంబుగన్. 123

వ. అప్పుఁ డవ్వసిష్ఠమునీంద్రుండు మున్నాకర్ణితంబైన
యక్షరద్వయంబు విధ్యుక్తంబుగా నచ్చోచ్చరున కుపదే
శించుటయు నతండును మహానందంబున నర్తనంబు
సల్పుచు వల్కలంబులును సువర్ణకలశంబులును వరాక్త
కాషాయంబులును సూక్ష్మరుద్రాక్షమాలికలును బట్టు
వస్త్రంబులును ముక్తాప్రవాళసమ్మిశ్రితాక్షమాలికలు
నారకూటతామ్రమలోహమయాదిపాత్రంబులునువ్యాఘ్రా
జినకృష్ణాజినంబులును స్వర్ణయజ్ఞోపవీతంబులును మణి
భూషణంబులును నమూల్యనవరత్నంబులును దత్తకాం
చనచీనాంబరంబులును శతసహస్రకోటిసంఖ్యాకంబులు
గాఁ దెచ్చి గురుదక్షిణ లిచ్చి కృతకృత్యుం డయ్యె

నతని మనోనైర్మల్యంబును వైరాగ్యంబును వివేకం
బును నౌదార్యంబును దాక్షిణ్యంబును సర్వసంపత్సం
గ్రహణంబును జూచి విస్మితులై యమ్మహర్షులు హర్షం
బునం దమలో నిట్లనిరి. 124

క. ధనయౌవనగర్వితు లగు
మనుజులచే ధనము లేశమాత్రం బయినన్
గొన నర్హము గా దార్జవ
మును శ్రద్ధయు శమము వలయు భువి దాతలకున్. 125

ఆ. శ్రద్ధవలనఁ జెందుఁ జతురాననావాస
మార్జవమున నొందు హరిపదంబు
శమముకతనఁ జేరు శంకరస్థానంబు
దాత యీగుణములఁ దనరునేని. 126

ఉ. అన్న మొసంగఁ బాడి యగు
నాఁకట నేఁకటఁ జెందువానికిం
జెన్నగ శీతభీతునకుఁ
జేల మొసంగఁదగున్ జలంబు ల
త్యున్నతభక్తిఁ బోయఁదగు
నోర్చి పిపాసఁ గలంగువానికిన్
వన్నియము నాతపత్రము ప్ర
వాసికి నియ్య నగున్ సుధీజనుల్. 127

వ. మఱియును తాపసులు ప్రార్థించినయతం డెవ్వం డైనను

దాతలకు నుత్తమపాత్రం బగు నది యుగాక. 128

సీ. వినయము భావశుద్ధియు వి
వేకము క్షాంతియు శ్రద్ధ యార్జవం
బును ధృతి వీతరాగతయుఁ
బొంపుగ మానసతీర్థముల్ జగం
బున మఱి జాహ్నవీప్రముఖ
పుణ్యసరిత్తులు బాహ్యతీర్థముల్
ఘనమతి వీనఁ గుర్వింకిన న
కల్మషతాప్తి ప్రసంగు నిచ్చలుఁ. 129

తే. అట్లు గావున వీఁడు శ్రద్ధాదిగుణస
మగ్రుఁ డితఁ డిచ్చునది గొన నగు నటంచుఁ
దలఁచి యాసంయమిప్రభుల్ తద్ధనంబు
పెట్టియలఁ బెట్టి కట్టి సంప్రీతి నెలఁగ. 130

క. ఆత్రేయమునులు చని చని
చోరుని జెస తిరిగి తిరిగి చూచిరి భీతిన్
వైరాగ్యయుతుల కేనియు
ధారుణి ధనసంగ్రహంబు దరకర మగుటన్. 131

క. చతురుల వృద్ధుల బాలుర
సతులన్ క్షితిపతుల యతుల మందుల ధనసం
తతి మోహపఱచుఁ దతి స
న్మతియుతుఁ డగు జాతమైన మనుజునికైనన్. 132

సీ. ధనమును సుర పరతరుణియు జూదంబు
గలినివాసస్థానములు దలంప
మదభయక్రోధదుర్మానలోభాతిమ
త్సరములు ధనమున సంభవించు
ధనసంగ్రహముతఱి దద్రక్షణవ్యయా
ద్యవసరంబుల దుఃఖ మావహిల్లు
సకలసౌఖ్యంబులు సమకూర్చి పదపడి
ధనము దుర్గతిఁ జేర్చుఁ దరతరంబు

తే. ధనము తృణకణముగఁ జూచు ధన్యమతికి
జగము తృణ మగు మఱి ధనసంగ్రహంబు
సలుపువాఁ డందఱకు సేవ సలుపవలయు
జగతిఁ గావున దుఃఖభాజనము ధనము. 133

వ. సమార్జితంబైన ధనంబు పరలోకహితార్థంబుగా సత్పాత్రవినియోగంబు సేయవలయు దానికి నెక్కుడగుధర్మంబెయ్యదియు లేదది యట్లుండె నట్లు భయార్తు లగుచు నమ్మునీంద్రు లల్లనల్ల నడచి యక్కాననంబు గడచి రామధ్యానంబు సలుపుచు నచ్చోరునిమహత్త్వంబునకు వెఱఁగందుచు ముహుర్ముహుఃప్రశంసాపరులగుచుఁ జని చని గంగాస్నానం బొనరించి పవిత్రితగాత్రులై హిమశైలంబున కరిగి రని చెప్పి సూతుం డిట్లనియె. 134

క. పరలోకబంధు లగుచును
లరిగిన నస్వస్థచిత్తుఁ డయ్యెం జోరుం
డురుబంధువియోగాదుల
నరుదుగ సంతప్తచిత్తుఁ డగుసరుపూడ్కిన్. 135

చ. మునిజనమైత్రిఁ జోరుఁడు స
 మున్నతసన్నుతమార్దవస్థితిన్
మనఁగ ధరామరాదులకు
మార్దవ మబ్బదె యట్లుగాన స
జ్జనములమైత్రి సంసరణ
సాగరతారణకారణంబు ప్రా
గ్జనికృతధర్మకర్మగుణ
సంజనితం బదియున్ వసుంధరన్. 136

మ. మును సత్సంగతిఁ బాపముల్ దొలఁగుఁ ద
న్మూలంబునన్ రామభ
ద్రునిపాదాంబుజభక్తి గల్గు మఱి యం
దున్బుట్టు విజ్ఞాన మా
ఘనవిజ్ఞానము కర్మబంధముల వే
గ న్మీటుఁ దత్కారణం
బునఁ గైవల్యముఁ జెందు మానవుఁడు సం
పూర్ణప్రభావోన్నతిన్. 137

ఉ. కూ్రరుఁడు మిత్రవంచకుఁడు
కుత్సితుఁడుం బిశునుండునుం బర
ద్వారియు మ్లేచ్ఛపట్టనని
వాసియు విప్రజనాధికారి యా
చారవిదూరుఁడుఁ వ్యసన
సక్తుఁడు నన్యధనాపహర్తయుఁ
వీరలు సాధుసంగతిఁ బ
విత్రగుణాఢ్యతఁ బొల్తు రెంతయుఁ. 238

ఆ. ధర్మకర్మపరులు నిర్మత్సరులు సదా
చారవంతు లలఘుసత్యరతులు
బ్రహ్మసమ్మితులు పురాణార్థవిదులు స
త్పురుషు లనఁగ జగతిఁ బరగువారు. 139

సీ. రహి నుపస్నానపురాణశ్రవణములఁ
జిత్తంబు నైర్మల్యసిద్ధిఁ గాంచు
సకలశ్రుతిస్మృతిసముదితధర్మముల్
గ్రమ మొప్పఁగాఁ బురాణములు నొడువు
నాపురాణవిహీను లక్ష్మీహీనులగతిఁ
గామితార్థంబులు గాంచలేరు
నవిఁ బురాణాకర్ణనమున మానవులకు
బ్రహ్మహత్యాదిపాపములఁ దొలఁచుఁ

తే. దారతమ్యంబు దెలియ విధాత నిఖిల
తీర్థజలఫలసంగతి నర్థిఁ దూన్ప
సమధికముగఁ బురాణ సంశ్రవణఫలము
భారమై తోఁచె నిఁక వేఱె పలుక నేల. 140

తే. ఎవ్వఁడు పురాణసుశ్రవణేచ్ఛవలన
నేమఱక మేలుకొనియుండు నిద్ధబుద్ధి
నతనివిజ్ఞానధననాశ మగునె తలఁప
దురితతస్కరవీరులు దొలఁగి పఱవ. 141

క. ఎచ్చట నచ్యుతకథ దగు
నచ్చట గౌతమియు గంగ యమున మొదలుగా
నుచ్చావచతీర్థంబులు
నిచ్చలు వసియించు ధర్మనిర్మలగరిమన్. 142

తే. శ్రవణయుగమున హరికథాశ్రవణనియతి
రామనామంబు మది నభిరామసరణి
రసన మాధవపాదసారసవిభాసి
జీవనము గల్గు వానిది జీవనంబు. 143

క. పాపారణ్యకుఠారం
బై పరగు పురాణసంహితార్థావళి ను
ద్దీపింపఁ జేయుదురు బుధు
లాపుణ్యులసేవఁ జేయ నగు భువి జనముల్. 144

శా. చోరుం డీగతి మంత్రిలబ్ధిఁ గని సం
శుద్ధాత్ముఁడై యత్తఱిన్
వైరాగ్యంబున సర్వవస్తువితతుల్
వర్జించి నిస్సంగుఁడై
ప్రారబ్ధాశుభకర్మసంహతులఁ బా
య న్మీటి నిర్దంభతం
బ్రారంభించెఁ దపంబుసల్ప సుజన
వ్రాతంబు లోహో యనన్. 145

వ. బ్రాహ్మముహూర్తంబున లేచి మహానదీస్నానంబు గావించి శుచియై వల్కలాజినపరిధానుండును రుద్రాక్షమాలికాధరుండునుగుశపాణియునై గురూపదేశక్రమంబునఁ జతురస్రసమస్థలంబును క్రిమికీటమశకాదివర్జితంబును నిష్పంకంబును నిర్బాధంబును నగువృక్షమూలంబుఁ జేరి వేణు పల్లవ భూమి దారు తృణ పర్ణాసనంబులు జపవేళ ననర్హంబు లగుట విసర్జించి వ్యాఘ్రాజినంబున మోక్షసిద్ధియుఁ గంబళంబున శోకనాశనంబును గుశాసనంబున యశోవృద్ధియు వస్త్రాసనంబున నారోగ్యంబును గృష్ణాజినంబున జ్ఞానసిద్ధియు నగుటఁ గృష్ణాజినాసనంబున నాసీనుండై గురుధ్యానంబును బ్రాణాయామంబును గావించి శ్రీకాముండు పద్మబీజంబులఁ బుత్రకాముండు పుత్రజీవిబీజంబుల మోక్షకాముండు రుద్రాక్షంబుల నక్ష

మాలికలు సేయవలయుట రుద్రాక్షమాలికాధరుండై గురూక్తమంత్రంబు ధారావాహికంబుగా జపియింప నదియె నిశ్శేషాఘహరం బగు రామనామంబై విలసిల్లె నివ్విధంబున ననుదినంబును ద్రిషవణస్నాయియు యుత వాక్కాయమానసుండును సర్వభూతదయాయుక్తుండు నధశ్శాయియు జితేంద్రియుండును నగుచు ఫలమూల జలపర్ణానిలశాకభక్షణంబు లొనరింపుచు నియతాహా రుండై యింద్రియంబుల మరల్చి మనంబు నాఁగి ఖేదంబు ను భ్రమయును బరాఙ్ముఖతఁ జెంద మనోవాక్కర్మంబు లేకప్రకారంబునం జెన్నొంద బాహ్యంబు మఱచి పవనం బు బంధించి తపంబు సలుపుచుండె నయ్యవసరంబున. 146

ఆ. భ్రాతృపుత్త్రమిత్త్రబాంధవదారాదు
లితఁడు రాక మసలె నేమి యొక్కొ
యనుచు సందియమున నందఱుఁ జింతచేఁ
గలఁగి పలుదెఱఁగులఁ బలికి రిట్లు. 147

సీ. తస్కరగ్రామణి ధన ముపార్జింపంగ
నహరహంబును బూని యరుగుచుండు
కాను వీసం బైనఁ గలుగ దయ్యెనొ నేఁడు
కాకున్న నితఁ డేల రాక తక్క
యతులకు వైరాగ్యయుతులకు ధనకాంక్ష
మలయు ననంగఁ జోరులకు లేదె

యర్థంబునకు యత్న మాచరించునతండు
ప్రాణంబు లైనను బరిహరించు

తే. జగము భ్రమయింపఁ దలఁచి యజ్జలజభవుఁడు
కామినీమణులను గనకము సృజించె
వీని రెంటిపైఁ గోర్కులు మాను నన్న
రుండు రెండవపరమేశ్వరుండు గాఁడె. 248

చ. కనకము చౌర్యకార్యమునఁ
గాని పొసంగదు చోరభర్త క
కయ్యనుపమవిత్తలాభము మ
హాత్ముల నొంచక కాని చెంద ద
య్యనఘుల నొంచినన్ సిరియు
నాయువుఁ గీర్తియుఁ బోవుఁ గావునన్
ధనఘనకాంక్షఁ గీడగు జ
నంబుల కిద్ధర నెల్లభంగులన్. 149

క. అన్యాయార్జితవిత్తము
మాన్యుల నేనియును నిరయమగ్నులఁ జేయున్
సన్యాయార్జితవిత్తము
ధన్యులఁ గావించు భువి నధన్యులనేనిన్. 150

తే. తనకు మూఁడేడులకుఁ జాలుధనము కూర్ప
నర్హ మంతకు మిగుల ధనాశ వలవ

దదియు సత్పాత్రవినియోగ మాచరింప
వలయుఁ బరలోకసుఖము కావలయునేని. 151

తే. మఱియు నన్యాయపరులసంపదభివృద్ధి
నిలువ కప్పుడ యణఁగు సందియము లేదు
తగ నవశ్యాయసిక్తగాత్రములఁ జెందు
నివము వైశాఖసూర్యుచే నింకునట్లు. 152

ఉ. జీవుల నొంచుపాతకము
చే మనుజుండు వినాశ మొందు న
య్యావిలచిత్తుఁ గాంచుయముఁ
డైనను భీతి వహించుఁ దద్భటుల్
వావిరి రోయుచుండుదురు
వానిభయానకలీల నొంచుచోఁ
గావున ధర్మవర్తన న
కల్మషవృత్తి మనంగ మే లగున్. 153

సీ. ఎవ్వఁడు చోరుల కెల్లను జోరుఁ డె
వ్వఁడు వంచకుల కెల్ల వంచకుండు
సింగంబు గనుగొన్న జింకలగతి నృపుల్
పాఱుదు రెవ్వనిపేరు వినిన
మూర్ఖులలోపల మొదలిమూర్ఖుఁ డెవం డె
వండు హింసకులకు దండధరుఁడు

సిరిమీఱ నాత్మసంజీవనార్థంబుగాఁ
జోరు లెవ్వానియాన మీఱలేరు

తే. గహనమున నిర్భయాత్ముఁడై యహరహంబు
జాగరూకత నెవ్వఁడు సంచరించు
నట్టిచోరుండు నిఖిలధనాశ విడిచి
యుగ్రతప మాచరించుచు నుండెనొక్కా. 154

చ. కనకముమీఁద రోసినను
గాంతలమీఁద విరక్తి గల్గునే
మునివరుమాన మైనను న
మున్నతయావనమత్తకామినీ
జనముఖదర్శనాంతముగ
సాగు యతీశ్వరులైన నొక్కచో
మనసిజుబారిఁ జిక్కుదురు
మానవతీతతిఁ గాంచి రేనియున్. 155

క. మున్ను రతిసౌఖ్య మెఱుఁగని
యన్నువవాఁడైన మోహితాత్ముండగుచో
నన్నులఁ గనుఁగొనినంతనె
ము న్నెఱిఁగినపూరుషులకు మోహము లేదే. 156

తే. రూపయావనసంపద నేపుమీఱు
కాంతయును మగవాఁడు నేకాంతసీమ

నిలుచు నత్తఱిఁ జిత్తము ల్నిలుపలేరు
నిలిపి రేనియు వారువో నియతమతులు. 157

క. అని తలపోయుచు బాంధవ
జనములు చింతాబ్ధి మునిఁగి సత్వరగతి నా
తని నరయ విపినమునకుం
జని రందఱు నొక్కటన్ ససంభ్రమము లగుచున్. 158

వ. అప్పు డాశబరులు కబరుల వన్యకుసుమంబు లలంకరించుకొని బర్హిబర్హగుంజాభూషణులై తనుత్రాణశిరస్త్రాణంబులు దొడిగి బాణబాణాసనముద్గరపట్టసాద్యాయుధపాణు లయి మృగయావ్యాపారదక్షంబులైన సాళువపరిముఖక్షుద్రపక్షిగణంబులఁ గరంబులం దాల్చియుఁ బదత్రాణంబులు మెట్టియు భక్ష్యభోజ్యంబులముడియలు వింటికొప్పులం గట్టియు శీతలజలాసవపూరితంబు లగు నలాబూకీచకప్రముఖపాత్రంబులు పట్టియు నడచి కేసరి హరి కరి హరిణ శ్వాపద ఝిల్లీ కోలాహలముఖరితంబును నానాద్రుమగుల్మలతాభిశోభితంబును నయిన ఘోర కాననంబుఁ జొచ్చి వెదకుచు నెడనెడం బుళిందులు తమ్ము నెదుర్కొని తోడ్కొని పోవం జని పక్కణంబుల విశ్రమించుచుఁ దదుపదేశమార్గంబున నరిగి యవ్వనం బంతయుఁ గ్రిమ్మఱం గ్రుమ్మఱుచు విస్వరస్వర సంపద వెలయఁ బరస్పరంబు నిజకులోచితభాషావిశే

షంబుల సల్లాపంబు లాడుచుఁ బాడుచు శృంగంబులఁ
బూరించుచు సింగంబులగతి లంఘించుచు సారంగంబుల
తెఱంగున దాఁటుచు భల్లూకంబులపెల్లునఁ ద్రుళ్లుచుఁ
గొమ్మమెకంబులరీతిఁ గొమ్మకొమ్మలకు గంతు లిడుచు
నతిదూరం బరిగి బుభుక్షాపిపాసల నలసి సొలసి యంత
నొక్కపుణ్యనదీతీరంబున వివిధతరుషండమండితం బయి
మనోహరంబైన వనంబుఁ జొచ్చి పథశ్రాంతి యపన
యించి యనంతరంబ విమర్శించునెడ నచ్చోరువ ముని
వేషధరుండును కుశాసనసమాసీనుండును నై గురూక్త
క్రమంబునఁ దారకమంత్రంబు జపియించుచు నన్యచింత
లుజ్జగించి మనోబుద్ధులు పరమాత్మం డగు రాఘవు
నందుఁ జేర్చి జ్వలజ్జ్వలనసంకాశుండై యున్నయచ్చోర
భూపతిం గని శబరవేషభీషణభాషణంబులు లేమింజేసి
యగుం గాఁ డనుచింతం గొంతసేపు నిల్చి పెద్దయుం
బ్రొద్దునకు నగు నగు నని నిశ్చయించి తత్సమీపంబు
నకుం జేరి నమస్కృతియును స్తుతియునుం గావించి
యతనితో నిట్లనిరి. 159

చ. కొమరులు నన్నదమ్ములును
గూఁతులు గోతులు బంధుమిత్రవ
ర్గములును నీపదాబ్జములు
గానఁగవచ్చిరి వీరి నందఱన్

సుమహితలీలచేఁ గరుణఁ
జూడుము దీనుల నీయధీనులన్
మముఁ బనిగొమ్ము లెమ్ము గరి
మం దప మేఁటికి నీకుఁ గానలన్. 160

క. బహుజనరక్షణదక్షుఁడ
వహహా తపమాచరింప నగునే నీకున్
మహితమహీసురవరు లి
మ్మహిఁ జేయు తెఱంగుసేయ మనకుం దగునే. 161

తే. దానధర్మము లొనరింప ధనము లేక
వ్రతములను దీర్థయాత్రోపవాసములను
గాత్రము కృశింప స్వర్గసౌఖ్యంబు గోరి
తపము సేయు దరిద్రుం డుదారనియతి. 162

క. క్షితి జనతతి నిరసించుట
నతులగతి న్మాటలాడ నర్హత క్షేమిన్
మృతునకు దరిద్రునకు సం
తతమతి గణుతింపఁ దారతమ్యము గలదే. 163

క. పరగేహములకుఁ బలుమఱుఁ
దిరుగుచు నాఁకటికి నొరులఁ దిరియుదు రెపుడున్
దురితాత్ము లగుట శునకము
దరిద్రుఁడును నొక్కరూప ధర నూహింపన్. 164

చ. చెలఁగి యపాత్రదానములు
            చేసి దరిద్రుఁ డగుం జగంబులన్
  బలియుదరిద్రభావమునఁ
            బాపము లెప్పుడు నాచరించు న
  క్కలుషదశార్తిచే నిరయ
            గామి యగు న్నరుఁ డిట్లు వెండియున్
  వెలయు దరిద్రుఁడై పరగు
            వెండియుఁ బాప మొనర్చు నెంతయున్.

తే. వృత్తశీలతపఃక్రియాశ్రీవిభాసి
  యై దరిద్రుఁ డనంతసౌఖ్యంబుఁ గాంచు
  నట్లు సేయక దుర్వృత్తుఁ డయ్యెనేని
  నాపదలఁ గుందు జన్మజన్మాంతరముల. 166

మ. ధనవంతుండు తపంబు సేయఁదగునే
            దానంబు గావించి స
  ద్ఘనతిం జెందఁగరాదె తత్క్రియకు ను
            ర్విం దీర్థయాత్రల్ దపం
  బును శీలంబును దేవపూజయు సమం
            బుల్ గావు మర్త్యుండు దా
  ననవద్యస్థితిఁ బాత్రదానమునఁ బు
            ణ్యావాప్తిఁ గాంచుం దగన్. 167

చ. సురుచిరపాత్రదానమునఁ
జూవె ధనాఢ్యుఁ డగు న్ధనాఢ్యవి
స్ఫురణ నొసర్చుఁ బుణ్యములు
పుణ్యమునం దిదివంబుఁ జెందు న
ప్పురుషుఁడు విత్తవంతుఁడును
భోగియు నై జనియించుఁ గ్రమ్మఱన్
సరసధనాఢ్యు లిచ్చుటనె
స్వర్గసుఖంబులు గాంతు రున్నతిన్. 168

చ. అరుదుగఁ ద్యాగభోగముల
కర్థము రూపసి యైనయాలు నీ
శ్వరచరణాబ్జభక్తియును
సజ్జనసంగతియుం గులీనతా
గరిమయు సత్కవిత్వమును
గాత్రపటుత్వము గల్గువారికిన్
వరుస మనోజ్ఞభోజనవి
వర్జితమార్గము స్వర్గ మేఁటికిన్. 169

చ. ఒడమె *గడించి యుంచితి వ
యో యది దాన మొనర్పరాదె యి
క్కడిఁదితపంబు లోకమునఁ
గల్గుకిరాతులు సేయువారలే

* కడించి—వ్రా. ప్ర.

తొడిఁబడ వేఁటలాడియును
దొంగిలియును న్మనువారుగాక యె
క్కుడితప మేఁటిసత్యగుణ
గౌరవముల్ మనజాతి కియ్యెడన్. 171

తరల. సవిత్రుతేజులు నీతనూజులు సాధువృత్తసమన్వితుల్
దివిజసమ్మతు లార్యవర్యులు దీప్తమూర్తులు వారిచే
భువి దివిన్ సుఖ మబ్బు నీకుఁ దపోవిధిం గృశియించినన్
భువనమోహనసౌఖ్య మబ్బునె బుద్ధి లోనఁ దలంపుమా.

క. సుతహీనుఁడు గతిహీనుఁడు
సుతవంతునిఁ బూజసేయు సురగణ మెపుడున్
సుతవంతుఁ డుత్తముఁడు స
త్సుతవంతుం డుభయలోకసుఖములు గాంచున్. 172

తే. పుత్త్రిరక్షణ మొనరించుమాత్ర మెవ్వఁ
డధమనిధుల నుపార్జించు నర్థ మవని
నతనిఁ గళ్మషవికరంబు లంటు వెప్పుడు
నంబుకణములు పద్మపత్త్రంబుఁ బోలి. 173

సీ. నుతియింపుదురు గృహపతి మునిప్రవరులు
దేవతలును బితృదేవతలును
బధిరపంగ్వంధకబ్రహ్మచారుల కెల్ల
గృహమేధి కెలనితం గోటిజన్ము

ధారుణీశ్వరుఁడైనఁ దస్కరవరుఁడైన
నాశింపుదురుగా గృహాధినేత
గృహివృద్ధిఁ గోరుదు రెల్లవేళలయందు
నతిథులు యతులు దిగంబరులును

తే. నాశ్రమంబులలో గృహస్థాశ్రమంబు
మేటి యందు విరక్తులై మెలఁగుయతుల
వర్తనము శాతతరతరవారిధార
మీఁద నటియించు చందమై మెఱయుఁగాదె. 174

క. రుంద్రగతి తురగములగతి
నింద్రియములు పరువు లిడ నిరీహాతతి ని
స్తంద్రమతి వాని నాఁగని
సాంద్రయశుండైనయతియుఁ జను దుర్గతికిన్. 175

ఉ. కావున నాలసింపక య
ఖండితసౌఖ్యరమావిలాసివై
నీ విటు లేచి రమ్ము మహ
నీయజనస్తవనీయశౌర్య మా
భావము లుల్లసిల్లఁగ న
పారకృపారసధార మీఱ సం
భావనచేసి యేలుము శు
భంబులు చేకుఱు నీకు నెల్లెడన్. 176

వ. అని యిట్లు బోధించునప్పలుకులు చెవిం జేర్పక యతండు

బధిరుని తెఱంగున నుండుటయుఁ జింతాక్రాంతస్వాంతు
లై వారలు వెండియు నిట్లనిరి. 177

తే. చోరబాధానివృత్తికై క్రూరబుద్ధి
నెవ్వఁడో మందుఁ బెట్టె నిన్నిట్లు వెఱ్ఱి
వానిఁ గావించె నక్కటా వానిఁ గనిన
నేము గురుపూజ సేయమే యిందఱమును. 178

తే. అతఁ డిక్కన వెడలి యెం దరిగెనొక్కొ
యింక నెఱుఁగంగరా దయ్యె నెఱుఁగఁబడినఁ
దనువుగల యంతకాలముఁ దలఁచుకొనఁగ
నొనర సంభావన యొసంగి యనుపలేమె. 179

వ. అని పల్కి తమలో నిట్లని యూహించిరి. 180

ఉ. మందులు మంత్రితంత్రములు
మందులుగా నొనరించుఁగాక ని
ష్పందతరోపలక్రియ న
భాషితభావులుగా నొనర్చునే
యెందును మున్ను విన్నయది
యేనియుఁ గన్నది యేనిఁ గా దిఁ కే
మందు మమందరోగగుణ
మయ్యెనొకో యిది వీని కియ్యెడన్. 181

తే. తెవులుతవులైనఁ బడియుండి నవయకున్నె
భంగసంగతనిజజరదంగయష్టి

బాలభానుప్రభాజాలభాసి యగుచు
నుండఁ బద్మాసనమునఁ గూర్చున్నవాఁడు. 182

వ. ఇట్టినిశ్చలత్వంబు భూతసంజాతవికారప్రకారంబు గాదు
గదా సర్వసుపర్వగణసమాశ్రయం బైన తుషారధరాధర
శిఖర ప్రాంతకాంతారాంతరంబున భూతంబులు చొరం
జాలునే యెట్లయినం బిశాచోన్మాద మద విదారణచణ
మంత్రప్రవణు లయిన వైద్యులం దెచ్చి వీనివికారంబు
డిందం జేయుదము మఱియును.

ఉ. కొందల మంద సందడిగఁ
గూఁత లిడుఁగా మఱి యుత్తెఱంగునఁగా
సందెజపంబు నేమమునఁ
జల్పునె యొండుగవంబు లైన? నీ
చందము చూడ భావనపి
సానము వీనిని సోఁకఁబోలు ము
న్నందఱిలోన నెక్కు డని
యందురు పోరడలు నేలవేలుపుల్. 184

క. దయ్యములకు నోడయుండవు
కయ్యెడ మ్రిచ్చులను మన్నిగొనఁ జొచ్చితి వీ
వియ్యెడవిలోన భావన
దయ్యము మము నెమ్మిఁ బనుపు దండము నీకున్. 185

వ. అని పల్కు వారలపల్కులు రామనామామృతసంపూరి

తాంతరంగుండై బాహ్యలోకంబు మఱచి పరమానం
దంబున నున్న యతనికర్ణంబులం జొరకయున్న దుఃఖితు
లై మరల నిట్లనిరి. 186

సీ. ఈవమానమున ఫల మేమి గామించితి
మించి స్వర్గంబు గాంక్షించినావొ
యెట్టిదియో స్వర్గ మెఱుఁగుదువే దాని
నెఱిఁ గాంచి నీ కెవ్వఁ డెఱుఁగఁ జెప్పెఁ
గాలాంతరసుఖంబు గామించి యీయున్న
భోగసంపద వీటిఁబుచ్చఁ దగునె
యాఁకటి కొదవిన యన్నంబు మెసవక
విడిచి భిక్షుకు నేఁగువెట్టి గలఁడె

తే. జపము లెచట నీ వెచ్చట స్వర్గ మెచట
దురితపరులకుఁ ద్రిదివంబు దుర్లభంబు
కదిసి దుర్మార్గరతుల సత్కర్మతతియుఁ
జౌటిభువి నిడుబీజముల్ సమము కావె. 187

తే. తనదుకులవర్తనమునకుఁ దగనిధర్మ
మాచరించుచు నుండు నరాధమునకుఁ
దత్క్రియలు నిష్ఫలతఁ జెందుఁ దప్తలోహ
కాండసంగత మగు జలకణముఁ బోలి. 188

క. ఘన వనుచితకర్మపరి
స్ఫురణంబున నరులు స్వర్గముం జెందుదురే

వరిగింజల గోధూమాహం
కురవితతి సముద్భవం బగునె యెందైనన్. 189

తే. నియతకర్మంబు లొనరించి నీచతముఁడు
స్వర్గసౌఖ్యంబు గాంచుట సందియంబు
చేరి మదగంధబంధురసింధురంబు
సూచిరంధ్రాంతరంబునఁ జొచ్చి చనునె. 190

వ. కావున నీవృథాప్రయాసంబున ఫలం బేమి గలదు వల్కలాజినంబులు గట్టి నిరాహారుండవై శీతవాతద్యోత మశకమక్షికాదిబాధితుండ వగుచు దుష్టమృగాకీర్ణం బయిన యివ్వనంబున నవయనేల యూరక యింటికిం జనుదెంచి యభీప్సితభోగంబు లనుభవింపుము చోరధర్మనిర్మాణస్రష్ట వగు నీవీకష్టంబునం జెందుటకారణంబుగాఁ జోరవీరు లగువుళిందు లందఱు నిరాశ్రయభావంబునఁ గుందుచుండుదు రని పెక్కుతెఱంగుల నతని బోధించు క్రించుచెంచులం గనుంగొని యందు దేశకాలవిభావజ్ఞుం డును మహాప్రాజ్ఞుండును నగు నొక్కజరచ్ఛబరుండు వారల కిట్లనియె. 191

ఆ. మీరు వచ్చుటయును మీ రనుపలుకులు
నితఁ డెఱుఁగఁ డిప్పు డించుకయును
సంగహీనవృత్తి శమదమసంపత్తి
దొనరఁ దపము సల్పుచున్నవాఁడు. 192

తే. వదలె నైహికసుఖము సర్వంబు నితఁడు
వెలి మఱచె దేవతాధ్యానవిలసనమున
సురలనైనను గనుదేఱి చూడఁ డింక
మాట లాడునె మనతోడ మౌన మెడలి. 193

ఉ. ఈతఁడు ధర్మవర్మతన
యిద్ధగురుప్రవరోదిష్టవి
ఖ్యాతమనూత్నమోదయద
ఖర్వమహామహాసియగాత్రుఁడై
శ్రీతరుణీమణీరమణుఁ
జిత్రసరోరుహపీఠి నిల్పి ని
ర్ధూతరజస్తమస్తముఁడు
దూరితకాముఁడు నయ్యెఁ గంటిరే. 194

వ. దురితకర్మసముద్భవంబు లగుభోగంబులు పెద్దగాలం బనుభవించివిరక్తుండయ్యె వైరాగ్యవంతుండు ముక్తుండు నగు నితనికతంబున మనకులంబు పవిత్రం బయ్యె నితం డిట్లు తపంబు సేయుఁ గాక నిర్బంధింపవలవ దీనియమం బున కంతరాయంబు సల్పినఁ బ్రత్యవాయ మగు మఱ లుం డని తెల్పిన వారలును బశ్చాత్తాపంబునఁ దమ్మును దమకులంబును నిందించుకొని దుఃఖించుచుఁ గ్రమ్మఱ నిజనివాసంబులకు నరిగి రని చెప్పి సూతుం డిట్లనియె.

తే. అడరి బడబాగ్ని నదులయు బ్బడఁచునట్లు
పాతకవ్రాతముల డిందు పఱచుచుండు
నెట్టిమంత్రంబులును సాటియే ధరిత్రి
రామనామమహామంత్రరాజమునకు. 196

వ. పరబ్రహ్మవాచకం బయిన రామనామంబు స్మరణమాత్రంబునఁ బాతకిజనంబుల పాతకసంఘాతంబులవలనఁ దరియింపంజేయు నిందులకుం బుళిందుండ ప్రమాణం బంతియ కా దీయర్థంబు దెలుపు నొక్కయితిహాసంబు గలదు వివరించెద వినుండు. 197

క. రామార్పితమానసులై
రామకథామృతము గ్రోలురసికులు ధన్యుల్
రామకథ చెవులఁ జేర్పని
యామర్త్యునిజని నిరర్థ మగు మర్త్యమునన్. 198

మ. సకలామ్నాయపురాణపారగుఁడు ని
ష్ఠాశాలి విద్వజ్జన
ప్రకరానందకరుండు సత్యవచన
ప్రాగల్భ్యసంపన్నుఁ డ
త్యకలంకుండు జితేంద్రియుండు కరుణా
యత్తైకచిత్తుండు నై
యొకవిప్రుం డొకయూర నుండు సుకృతో
ద్వ్యక్తిం బ్రవర్తిల్లుచున్. 189

తే. అతఁడు కాశీపురంబున కరుగఁ దలఁచి
యగణితం బైన స్వాపతేయంబుఁ గొనుచుఁ
జనియె నిశ్శ్రేయసాపేక్షఁ గొనలుసాగ
ధర్మకర్మాభినిరతుఁ డై దాఁటఁబట్టి. 200

వ. ఇ ట్లొక్కరుండునుం జనిచని యమహార్గమధ్యంబున
నొక్కయెడ. 201

సీ. మరుతూపులో యివి మరుతూపు లగునేని
విగతరజోద్వృత్తి వెలయు టెట్లు
జక్కవలో యివి జక్కవ లగునేని
యళ్లు కొంది మొగయక నిలుచు టెట్లు
శశిబింబమో యిది శశిబింబ మగునేని
నిష్కళంకస్ఫూర్తి నెగడు టెట్లు
పులినస్థలమొ యిది పులినస్థలం బేని
నిష్ప్రవాహతటాప్తి నెలయు టెట్టు

తే. లనఁగఁ గన్నులు చన్నులు నాననంబు
కటిభరంబును దనరారఁ గాంతుతోడి
పొలయలుక నేఁగురతిఁ జోలు పొలఁతి నొకతెఁ
గనియెఁ గిసలయసుకుమారగాత్రి నతఁడు. 202

వ. అదియును. 203

చ. యువజనమత్తనిర్మథన
యుక్తి కి ష్వాఁడిగ నూలు భాషసం.

భవునిశిలీముఖంబు లనఁ
బాటిలి చూపులు రత్నకుండల
ప్రవిమలశాణపాళికల
పై నొరయ న్మణిహారదీధితుల్
రవికిరణాచ్ఛదీప్తిఁ దొ
రంబుగ మాత్మలయ న్మెలంగుచున్. 204

చ. అవయవమంజులత్వమును
హారిసువర్ణసవర్ణమూర్తియు
న్నవనవయౌవనోన్నతియు
నాకమృగాక్షుల కైనఁ గోరికల్
దవులఁగఁ జేయు నయ్యువిద
దారసిలె న్వలఁ జిక్కి జక్కవల్
మివులఁ బెనంగులీలఁ జను
మిట్టలఁ గంచెల పిక్కటిల్లఁగన్. 205

ఉ. వేణి కటి న్నటింప నర
విందదళోదరసోదరప్రభం
బోణులు చెంగలింపఁ బద
పల్లవరక్తిమ సాంధ్యరక్తిమన్
శ్రోణి యొనర్ప నొక్కమృదు
గీతము పాడుచు సంసపీఠిపై

వీణియఁ జేర్చి వచ్చి నలి
 వేణిఁ గనుంగొని మోహితాత్ముఁడై. 206

తే. ఇట్లు మోహించి విప్రుఁ డయ్యింతితోడి
సరససల్లాపసౌభాగ్యగరిమఁ గూడి
నడువ నుత్సుకుఁ డయ్యె సుందరులఁ గాంచి
యెట్టివారును మది నిగ్రహింపఁగలరె. 207

వ. కొన్ని యడుగులు నడచి యప్పుడంతి కిట్లనియె. 208

ఉ. ఇందునిభాస్య యెచ్చటికి
 నేఁగెద వెందులనుండి రాక నీ
యందముఁ జూచి నాతనువు
 నర్థముఁ బ్రాణములుం గృతార్థతం
జెందె నశేషరాజ్యరమ
 చెందినచందము నొందె డెంద మా
నందరసార్ద్రితం బరగె
 నాఁటె మనోజనిశాతబాణముల్. 209

సీ. నీదరహాసకాంతికి సాటిగాక చం
 ద్రిక మంచుపేరికన్నీరు నించు
నీదంతరుచిఁ బోల నెంచి వజ్రములు శా
 ణకషణవేదన నొంది గరిమఁ దొరఁగు
నీలోచనయుగంబుఁ బోలఁ జకోరికల్
 దరిసి వెన్నెలఁ గ్రోలి తపముసల్పు

నీ రదచ్ఛదదీప్తిఁ గోరి బింబంబు స
ద్ద్విజరాజు ననిశంబుఁ దృప్తి నూన్చు
తే. నీయలసయానదశఁ పూన నేర్పులేక
సమదకుంభీంద్రడింభంబు లమితలజ్జఁ
దూలి కేళీకళావ్యాజ దోహలమున
ధూళి యుద్ధూళనముసేయుఁ దోయజాక్షి. 210

క. మఱఁ డోర్వఁడు పికవాణీ
నిరతము నను మనుపు నీలనీరదవేణీ
కరుణఁ గను మరుణపాణీ
పారి నీడగు నాజ్ఞఁ గడవఁ బులినశ్రోణీ. 211

వ. అనిన నవ్వనిత తీర్థయాత్రాప్రసంగవశంబున వచ్చితి
వారణాసికి నరిగెద నని చెప్పి యతని కిట్లనియె. 212

చ. సతతనిసర్గభీరువులు
సారసగంధులు దారు సాధుసం
గతిఁ జని రేని భీతిలరు
కాంతలు శీలగుణాదిరక్షణ
స్థితి విలసిల్లఁగావలయు
శీలవిహీనతఁ గుందునట్టి యు
య్యతివలు సేయుపుణ్యము ని
రర్థ మగున్ ధరణీసురోత్తమా. 213

సీ. జారులు చోరులు నారుల నర్థంబు
హరియింపఁ దలఁపుదు రట్లు గాన
జారచోరులతోడ సహవాస మొప్పదు
మిముబోంట్లసంగతి మెలఁగఁ జన్నె
నీపల్కుపల్కులనెఱి చూడ నీయందు
జారత్వవిస్ఫూర్తి సహజ మయ్యె
వైరాగ్యయుతుఁడ వై వారణాసికిఁ జను
వాఁడ వింతులమీఁద వాంఛ దగునె

తే. జారులకు దూషకులకును జోరులకును
ధరణి నబ్బదు తీర్థయాత్రాఫలంబు
కృపణు దీను వ్రతస్థునిఁ గృశుని నైన
మరుఁడు బాధించుఁబో యింక మాట లేల. 214

తే. వనము నేకాంతగతియును జవ్వనము ధనము
తొలుత మదహేతువులు దల్లితోడ నైనఁ
దోడఁబుట్టువుతోఁ గూఁతుతోడ నైన
నెనసి యేకాంతమున వసియింపఁ దగదు. 215

తే. ఇంద్రియంబులు విద్వాంసునేనిఁ గుంచు
నవియుఁ గడు బలవంతంబు లగుటఁజేసి
యంగనాసుఖ మణుమాత్ర మైన నొసంగు
నదియు నిహపరసుఖలక్ష్మి నాహరించు. 216

తే. వేశ్య హరియించు నెఱిమించు విత్తసమితి
దాసి వోకార్చు ఘనతపోధనసమృద్ధి
విధవ యాయువు సిరియును వీటిఁబుచ్చు
నన్యరామ యీయన్నియు నపహరించు. 217

క. జారునకుం బరలోకము
దూరం బగు ధనము వోలియు దుఃఖము లొదవున్
జారుం డపూజ్యవృత్తికిఁ
గారణ మగుఁ దచ్చరితము గాల్పనె విప్రా. 218

సీ. జారుని భూపతి గాఱియ నొందించు
జారుని నిందించు జనము దినము
క్షణికసుఖంబైన జారత్వమున మన
కిరువురకును ఫల మేమి గలుగు
నైహికసౌఖ్యంబు లాసించెదేనియుఁ
బరలోకసుఖమైనఁ బరిహరింపు
మటఁ బరలోకసుఖాదరమతివేని
యైహికసుఖములయాస మాను

తే. నీవు చంచలమతివి మహీసుపర్వ
వ్రతము లొనరించుచును బతివ్రతలలోన
ఖ్యాతి గాంచితి విప్రవంశాభిజాత
నేను నిన్నెట్లు వరియింతు నెఱుఁగఁ జెపుము. 219

వ. అనిన విని విప్రుం డిట్లనియె నోమానిని నీ వనినయట్ల
క్షణమాత్రపరివర్తనంబునఁ బ్రత్యవాయంబు సంఘ
టిల్లుఁ బరలోకవిరోధి యగు నిది యథార్థంబ యిదిగో
వివాహపూర్వకంబ బడ్యేనేని మనకిద్దఱకు నిర్భయనిరతి
శయానందంబు నెందుఁ నీయాశయంబును నిదియ కదా
యని పల్కి యావజ్జీవంబునుం గూడి యుండుటకు
సమయంబుచేసి యొడంబఱిచి విధ్యుక్తంబుగాఁ బాణిగ్ర
హణం బాచరించి దానిం గూడి సురతకేళీలోలుం డై
తత్పాకాన్నంబు భుజియించుచు నధమజనుండు నిధిఁ
గన్నచందంబున నానందసందోహనిమగ్నమానసుండై
యుండె నిట్లు. 220

తే. అదియు నతఁడును దంపతు లగుచుఁ బ్రేమ
లిరువురకు నొక్కచందమై యింపునింపఁ
గూడి క్రీడించుచును జని వేడు కలరఁ
గాశిఁ జేరిరి ధనధాన్యకలితు లగుచు. 221

ఆ. అవ్విధమునఁ జేరి యతఁ డింతియును దాను
నల్ల మలత నొక్కయిల్లు గట్టి
యందు నధివసించి యన్నదానముచేసె
వారణాసిఁ గాశివాసులకును. 222

తే. యతులకును మానివరులకు నతిథులకును
వ్రతపరాయణులకుఁ దీర్థవాసులకును

నతులభక్తిఁ జతుర్విధాహార మిడుచుఁ
గాఁపురముచేసె నకాంక్షికాపురమున. 223

మ. అమితస్వర్ణసవర్ణసూపరుచి యా
హా సిద్ధసిద్ధార్థక
ర్దమసంమిశ్రితషాడబప్రితతి యా
రా ర్థామతామోదవి
భ్రమసంభావితశాకసౌఖ్యము భళీ
రంజిల్లు హైయంగవీ
నముసాం పేమన నంచు మెక్కుదురు కాం
త న్మెచ్చుచున్ భూసురుల్. 224

మ. కలమాన్నంబును గోస్తనీకదళికా
ఖర్జూరమాకందస
త్ఫలముల్ తేనియ జున్ను పానకములుం
బచ్చళ్లు నొబ్బట్లునుం
బులగంబు న్వడియంబు లప్పడములున్
బూరెల్ రసావళ్లుఁ జ
క్కిలముల్ వెట్టఁగ మెక్కి భూమివిబుధుల్
గీర్తింతు రత్తొయ్యలిన్. 225

మ. తగ వేఱొక్కనియింట నోదనము *యే
తత్స్నామగాయంబు యె

* వేదపరిభాష—“ఏతత్సామగాయం నాస్తే” (నాస్తిశబ్దము (గాహ్యము.)

చ్చఁగ నివ్విపుప్రిసియింటిభోజనము *తే
జోపా ♦పృణంతంచయున్
సొగసుల్ మీఱ §యదశ్వమేధ యని యం
చుఁ వేదభాషావిశే
షగతిఁ భూమిసురవ్రజంబు రసనా
చాపల్య మేపారఁగన్. 226

ఆ. ఇట్లు తృప్తి నొంది హృదయంబు లలరార
దానిపాకచతురతామహిమయు
నతనిశ్రద్ధ తాల్మి యనుకంపయును నెంచి
పొగడు నన్వహంబు బుధజనంబు. 227

వ. ఇవ్విధంబున వార లతిథిసపర్య యొనరించుచుఁ బ్రసిద్ధు
లై యనోన్యానురక్తిం బ్రవర్తిల్లుచుఁ గాశీపురంబునం
గాఁపురంబు సేయుచు నుండి రిట్లు పెద్దగాలం బరిగిన
యనంతరంబ యతండు దానివేషభాషావిశేషంబులవల
నను మజ్జనభోజనాలంకారాదికర్మంబులవలనను రతివ్యవ
హారకథాకథనంబులవలనను విప్రకులోచితవృత్తంబు
లేకుండు టరసి సందియంబు నొందుచుఁ జింతాక్రాం
తుండై యొక్కనాఁ డేకాంతంబున దానితో నిట్లనియె. 228

---

* "తేజోవాఆజ్యం" (ఆజ్యము) ♦ "పృణంస్తంచ పపురించ" (పప్పు) § "యదశ్వమేధ స్సమృద్ధ్యై" (సమృద్ధి)

ఉ. సుందరి నీదువర్తనముఁ
జూచిన బ్రాహ్మణజాతిధర్మ మే
చందమునందు లే దిపుడు
నందియు మేల నిజంబు దెల్పు మీ
వెందుల నుండు ముందు కుల
మెయ్యది నీతలిదండ్రు లేగతిం
జెందిరి జాతి దాఁచినను
చెయ్వులు డాఁగునె మాట లేఁటికిఁ. 229

తే. ఎలయుచెయువులచేఁ గులం బెఱుఁగఁ బాడి
తెలియ నగు శీలమున జన్మవిలసనంబు
భాషణంబుల విద్య యేర్పాటు నొందు
రూపమునఁ దెల్ల మగుచుండు రుచిరచుహిమ. 230

తే. అనుడు నధియును విప్రకులాభిజాతఁ
గా నని యథార్థముగఁ బల్కఁ గని యతండు
వేఁడి నిట్టూర్పు నిగుడించి విన్నఁబోయి
పోయి యవ్విధ మెఱిఁగించె భూసురులకు. 231

శా. ఆకాశీపురవాసు లందఱును మ
న్నాదుష్టజాత్యంగనా
పాకాన్నంబు భుజించుచుండుటను ద
త్పాపిష్ఠదుర్భాషిత్వ

ణాకర్ణించి తదీయచర్యలు నితాం
తాశ్చర్యముం జెంది హా
హాకారం బొనరించుచుం బలికె రి
ట్లనోన్యముఖ్ దీనతన్. 232

సీ. కలుగు జాతిభ్రంశకరముఖ్యబహుళదో
షములు పరాన్నభక్షణముకతనఁ
గులశీల మెఱుఁగక కుడుచు నన్నముకంటె
గరళమాంసాదిభక్షణము లెస్స
యన్యపాకము మాని యాత్మపాకాన్నంబు
భుజియించువారలు పూజ్యతములు
మిగులఁ బరాన్నంబు మెసవువారలకును
గామాంధులకుఁ బుణ్యగతులు గలవె

తే. యహాహా శ్రీకాశి యెచటఁ బరాన్న మెచట
బ్రాహ్మణాధముఁ డెచ్చట బవిసి యెల్లఁ
దూల మనబుద్ధి బూరెలపాలుచేసి
యెఱుఁగక భుజించితిమిగదా యిన్నినాళ్లు. 233

తే. వీఁడు మదనాగ్నిఁ జెడియెఁ గొంవ్వాఁడి దఱిఁగి
మనము జఠరాగ్నిఁ జెడితి మిహ్మాయ దెలియ
కేమి సేయుదు మెచటికి నేఁగువార
మీమహాఘమునకు నిష్కృతి యెందు గలదు. 234

క. భోజననియమస్థితి చే
రాజిలుభూదేవుఁ డిహపరసుఖార్థుఁ డగున్
భోజనము పరీక్షించిన
యోజ వధూజనపరీక్షయుం జేయఁదగున్. 235

మ. అని కాశీనగరాధివాసు లగు వే
దాంతార్థవేదుల్ తపో
ధనులున్ శ్రోత్రియులున్ యతుల్ వ్రతపరుల్
ధర్మిష్ఠులున్ శాస్త్రవి
జ్ఞులున్ మానులు బ్రహ్మచారులును దు
స్తారవ్యథం గుంది యొ
య్యనఁ దత్పాపము వాయఁజేయుటకుఁ బ్రా
యశ్చిత్త మర్థించుచున్. 236

తే. అచట శమదమసంపన్నుఁ డైన యొక్క
యతివరునిఁ జేరి వందనం బాచరించి
స్వామి యిది యొక్కపాపంబు సంభవించెఁ
దెలియ వినుఁ డని యిట్లని పలికి రపుడు. 237

సీ. ఈపట్టనమున మహీసురాధముఁ డొక్కఁ
డతిథిపూజారతి నన్నదాన
మొనరించుచుండ మీరును మేము వానింట
నెప్పుడు భుజియింతు మెలుకమాలి

యాతనియాలు బ్రాహ్మణి గాదు సరసాన్న
మారగింపఁగఁ బెట్టె నదియు మనకుఁ
గుడిచినయన్న మప్పుడ జీర్ణ మగుఁ బాప
వితతి యంతంతకు వృద్ధిఁ బొందుఁ

తే. గలుగు నొకపరి చేసిన కలుషమునకుఁ
బ్రాచితము దుష్కులాంగనాపాకశాక
పూపసూపాన్నసంతతభుక్తిఁ జొక్కు
మనయఘమునకు నిష్కృతి యొనరఁగలదె. 238

క. నీచతరకర్మకరణత
నాచారవివర్జనమున నాలస్యమునన్
నీచాన్నభోజనంబున
నేచియుఁ జెడు భూసురుండు మృత్యువుపాలై. 239

ఆ. అఘవిశిష్ట మగుపరాన్నంబు భుజియింపఁ
గలుషపరులకైనఁ గా దనంగ
వ్రతతపోజపోపవాసాదినిర్మల
ధర్మకర్మలకును దగునె తినఁగ. 240

మ. అని పల్కన్విని యమ్మహోమహాఁడు హా
హా యంచు నాదుష్టభా
మిని రావించి యచంచలప్రతిభ నో
భామాత్మి నీ వేతలం

బున జన్మించితి శీల మేకరణి నీ
భూమీసురుం డేవిధం
బున నిన్నేరె నిజంబు దెల్పు మన న
ప్పూఁబోఁడి తా నిట్లనున్. 241

తే. తగనికార్యంబు సేయంగఁ దగదు బుధుఁడు
మొదల చేయకమానిన నదియె లెస్స
పూని యజ్ఞానమతిఁ జేసెనేని మరల
నది పరీక్ష యొనర్చు టనర్థ మండ్రు. 242

తే. నన్ను నవ్విప్రుఁ డొకకాననంబులోనఁ
గాంచి కామించి నను మించఁ గలసిమెలసి
యంత నాచేతిపక్వాన్న మారగించె
నిపుడు నాజాతిఁ దడవిన నేమి గలదు. 243

సీ. ఈద్విజాధము నన్ను నిట్లు దంపతులుగా
దైవంబు గూర్చె నింతయు నిజంబు
రతికాంక్ష సేయుదు రతివలు గావున
రతిఁ జొక్కుతనకు దుష్కృతము గలదె
సదమలద్విజజాతిసంజాతఁ గాను నే
నితఁడు మత్సంగతిఁ బతితుఁ డయ్యెఁ
గదిసి తదన్నభక్షణమున వారణా
సీవిప్రు లందఱుఁ జెడిరి పిదపఁ

తే. దాఁ జెడుటగాక జాతి కంతకు నితండు
చేటు గావించె నిం కేమి చెప్పఁ గలదు
మనకు నెవ్విధి నింకఁ బావనత గలుగు
నవ్విధానంబు గావింపు మనఘచరిత. 244

వ. అని పల్కిన విని జానిదుర్జాతిసంజాతఁగాఁ దెలిసి యతం
డు చింతించుచున్న సమయంబున. 245

సీ. కాశ్య పాత్రి వసిష్ఠ గాధేయ గౌతమ
జమదగ్ని వృద్ధగౌతమ పులస్త్య
శక్తి గాలవ పరాశర రోమ శాగస్త్య
కపిల భారద్వాజ కణ్వ పులహ
గార్గ్య విదర్భ మార్కండేయ దేవల
నారద పర్వత క్షౌరపాణి
శృంగి మేధాతిథి బృహదగ్ని సంవర్త
కశ్యప వ్యాస మంకణ శమీక

తే. విజయ రుచిక విభాండక శ్వేతకేతు
గౌరముఖ ధౌమ్య జైమిని మారకాది
మునులు మణికర్ణికాతీర్థమున మునింగి
యందు మాధ్యాహ్నికక్రియ లాచరించి. 246

క. తత్తటి నిలువఁగ వారిం
దత్తఱమున్నఁ జేర నేఁగి తద్ధ్యాదివిజుల్

చిత్తములు గలఁగఁ బ్రాయ
శ్చిత్తం బర్థించి ప్రణుతిసేయుచు భక్తిన్. 247

వ. తద్వృత్తాంతం బాద్యంతంబు వివరించి యిట్లనిరి. 248

చ. సతతము వాక్తనూహృదయ
సంజనితాఘనిదాఘ మాఱ ని
ష్కృతి యొనరింపఁగావలయుఁ
జేరి విచక్షణుఁ డంతఁ బాయు దు
ష్కృతతతి దాన ముక్తి యగు
సిద్ధము గావున నార్యవర్యస
మ్మతమునఁ గర్మ మారసి క్ర
మంబున నిష్కృతిసేయ నొప్పగున్. 249

ఆ. పాపరహితుఁడైన నోపిక నిష్కృతి
కాయశుద్ధికొఱకుఁ జేయవలయు
ననిన దురితచరితుఁ డనయంబు దా నది
సేయకున్న నెట్లు చెందు శుద్ధి. 250

సీ. అజ తురంగమ మృగ గజ మహిషాదిక
ఖరవధల్ సంకలీకరణ మయ్యె
మలినీకరణ మయ్యె మద్యపానంబును
నండజ క్రిమి కీటకాదివధలు
వాణిజ్య శూద్రసేవా దుష్టమిత్రత
లట యపాత్రీకరణాఖ్యఁ బరఁగు

పుత్రమైథునము దుష్టభోజనాదికము జా
తిభ్రంశకర మనఁ దేజరిల్లు

తే. నన్యదురితంబులు ప్రకీర్ణకాఖ్యఁ దనరుఁ
దగ రహస్యప్రకాశకృతంబు లగుచు
వఱలు నీరీతిఁ బాతకావళికి నెల్లఁ
గలదు నిష్కృతి దుష్కృతకర్ములకును. 251

వ. కావున జాతిభ్రష్టుం డగు నీకష్టవిప్రునింటఁ గుడిచిన దురితంబువలన మమ్ము నందఱ నుద్ధరింప మీరె కాని యొండు శరణంబు లే దని ప్రార్థించుటయు నఖిలప్రాయశ్చిత్తవిధిజ్ఞు లయ్యు నమ్మహాముమ లప్పాపంబు వాపు నుపాయంబు గానక చింతించునవసరంబున నందు నొక్క మునీంద్రుండు తత్సభామధ్యంబున లేచి యందఱు విన నిట్లనియె. 252

శా. ప్రాయశ్చిత్తముఁ జెప్పెదన్ వినుఁడు పా
పధ్వంసనిస్తారకో
పాయం బైనది తన్మహామహిమ చె
ప్పం జిత్రం మెట్లన్నఁ గా
యాయాసంబును విత్తహానియును లే
కామ్నాయవాగీడిత
స్ఫాయం బై భవముక్తిఁ బొల్చు నది సం
ధ్యావ్యంబు మహాత్మ్యలికిన్. 253

మ. తతి శ్రీశబ్దము చెంత, నొక్క జయ శ
బ్దస్ఫూర్తి చెంతన్, జయ
ద్వితయాంతంబున రామనామ మతిభ
క్తిం గూర్చి యశ్లోకవిం
శతిహారంబు జపంబుసేయఁదగు ని
ష్ఠం దత్క్రియాభ్యాసికిన్
క్షితి గీర్వాణు వధించుపాపమును బ్రి
క్షీణం బగున్ గ్రక్కునన్. 254

ఆ. దురితకర్మవితతి నిరసించుశక్తి శ్రీ
రామచంద్రదివ్యనామమునకు
నెంతగలుగు నవని నంతపాపము సేయఁ
గలఁడె యెట్టిదురితకర్ముఁ డైన. 255

ఆ. అఖిలకలుషములను హరియించు హరినామ
మునకు శక్తి యెక్కుఁ డనుచుఁగాదె
యనని విబుధవర్యు లతిరేకభీతి ని
ష్కృతులు వేఱువేఱఁ జెప్ప రెలమి. 256

సీ. బ్రహ్మహత్యామద్యపానగుర్వంగనా
గమసువర్ణస్తేయకము లనంగఁ
గలుగుమహాపాతకముల దుస్సహ భో
జనదుష్ప్రతిగ్రహాజారకర్మ

వైశున్యచోరతాపప్రముఖోపపాతక
పరితతుల నడఁచు శ్రీరామనామ
మదియునుగాక శుకాదిసన్మునులును
యతులుఁ గ్రతుక్రియారతులు నతుల

తే. ధర్మకర్మలు నొనరించు కర్మములకుఁ
దుదిఁ బ్రమాదంబుచే లోప మొదవెనేని
కీర్తి వెలయంగ నది హరికీర్తనంబు
కతనఁ బరిపూర్ణ మగు నని శ్రుతులు పలుకు. 257

తే. అన్వయభ్రష్టులకును దుష్టాత్ములకును
వ్రాత్యులకును సదాచారవర్జితులకు
ఖలులకు నగమ్యకామినీకాముకులకు
శరణ మగు రామనామసంస్మరణ మవని. 258

తే. ఎట్టిదుర్మార్గవర్తనునేని పూని
పాపములఁ బాపి వైకుంఠపదముఁ జేర్చు
నఖిలమునిముఖ్యులకుఁ బరమాస్పదంబు
మహిత మగు రామనామాఖ్యమనుజపంబు. 259

క. రేయిటిపాపము రేయిటఁ
బాయంగాఁ జేయుఁ బగటిపాపము పగటిం
బాయంగఁ జేయు నెపుడున్
శ్రీయుత మగు రామజపము సిద్ధమునుండీ. 260

వ. అని పలికె యంత. 261

ఉ. అమ్మని యమ్మహీసురున
కమ్మదిరాక్షికి రామనామమం
త్ర మ్ముపదేశ మిచ్చి సత
తంబుఁ దదన్నముఁ దిన్నవిప్రవ
ర్గమ్ములఁ జేరఁ జీటి యను
కంప దలిర్పఁగ నిమ్మనూత్తమం
బిమ్ముల మీరు నిట్ల పఠి
యింపుఁడు పాపము దీఱు మీ కనన్. 262

తే. కొందఱు శిరంబు లూఁచుచుఁ గొంద ఱిది య
సంగతం బని నవ్వుచు సంశయింప
నమితవిత్తవ్యయప్రయాసములఁ గాని
కా దనుచుఁ గొంద ఱెంతయుఁ గలఁకఁబడఁగ. 263

వ. అయ్యవసరంబున. 264

సీ. నీలోత్పలచ్ఛాయ నేలు మేలునఁ జెన్ను
మీఱు నీలపుడాలుమేనితోడఁ
గర్ణాంతవిశ్రాంతకాంతంబు లై తెలి
దళుకొత్తుపద్మనేత్రములతోడ
సంపూర్ణపూర్ణిమాసాంద్రచంద్రప్రభ
గ్రమ్మ నిమ్మగు మోముఁదమ్మితోడ

సౌదామనీదామసద్ధామమై ఖరి
డంబై నకనకాంబరంబుతోడ
తే. కరతలాంచితశంఖచక్రములతోడఁ
గౌస్తుభాలంకృతోరువక్షంబుతోడఁ
దేజుగల పాఁపమేపరి త్రేజి నెక్కి
యెలమిఁ బ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు. 265
చ. సునియతభక్తియుక్తి బల
సూదనముఖ్యసుపర్వకోటియున్
సనకసనందనప్రముఖ
సన్మునులుం గపిలాదియోగులుం
దను వినుతింప భూషణవి
తానవిభావిభవాభిశోభియై
వనరుహలోచనుండు భగ
వంతుఁ డనంతుఁడు చెంత నిల్చినన్. 266
వ. ఇట్లావిర్భవించిన చతుర్భుజుం గాంచి సాష్టాంగప్రణామం
బు లాచరించి యమ్మునీంద్రులు పులకాంచితాంగులును
నానందజలప్లుతాక్షులు నై యద్దేవు ని ట్లని స్తుతియించిరి. 267
భుజం. యమిస్తోమసన్మానసారామ్మచైత్రా
య మిత్రక్షపానాయకామేయనేత్రా
య మేశాయ ధారాధరాభాయ తుభ్యం
నమః సర్వలోకైకనాథాయ విష్ణో. 268

క. తగ జలచర సూకర నర
మృగ వామన పరశురామ మిహిరకుల బలా
ద్యగణితరూపంబుల నీ
జగములఁ బాలింతు వీవు జగదారాధ్యా. 269

నిరోష్ఠ్యకందగర్భితమణిగణనికరము.

జనిలయరహిత యజనరత
జనరంజన జలజనయన శరనిధిశయనా
కనకనయనహర ఖరతర
హననా యనఘ కరివరద యజర హరసఖా. 270

(గోమూత్రికాబంధము.)

క. కరివరద దివిజరక్షా
దర వనధరధామగాత్ర దరచక్రకరా
గిరిభరణ దితిజశిక్షా
పర దినకరసోమనేత్ర పరచక్రహరా. 271

తే. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్త
పురుషోత్తమ మముఁ గరుణారసార్ద్ర
దృష్టి వీక్షించి రక్షింపు దేవదేవ
యిదె నమస్కృతు లొనరింతు మిందఱమును. 272

మ. అని కీర్తింపఁగ నంత నాహరి యనం
తాదిత్యసంకాశుఁ డై

ట్లను శేషాదిరసాతలేశ్వరులు ప్రి
హ్లాదాది దైత్యుల్ సనం
దనముఖ్యర్షులు శక్రిముఖ్యసురబృం
దంబుల్ ప్రజానాథము
ఖ్యనిలింపేంద్రులు సావధానమతి నా
కర్ణింపుఁడా చెప్పెదన్. 273

తే. రామనామంబు తారకబ్రహ్మసంజ్ఞఁ
బరగుఁ దన్మహిమంబు శంకరుఁ డెఱుంగు
నమ్మహాదేవునామ మహత్త్వ మర్థి
నే నెఱుంగుదు వేఱొకర్డుఁ డెఱుఁగఁదరమె. 274

తే. విమలమతితోడ రామనామము జపింప
వలయు వెండియు జపియింపవలయు నదియు
ప్రణవపూర్వకముగ దానిఁ బఠనసేయు
వేదములు సాంగఫలమిచ్చు విప్రులకును. 275

క. తులలేనిసిరులు వఱలుం
గలుషంబులు దొలఁగు గర్వకైతవమాయా
కలితేర్ష్యావిముఖత ని
శ్చలరామజపంబు సల్పు సద్ధన్యులకున్. 276

తరళ. తొలుత మత్పదభక్తుఁడై శివదూషణం బొనరింప నే
నలరి ముక్తి యొసంగ వానికి నర్థి మత్పదసేవ దా

నలంతి గాదు ప్రశస్తవస్తువు లైన నిచ్చెద నుర్వి ని
మ్ముల నదూషకుం డైనవానికి ముక్తిమార్గము చేకుఱుక్.

తే. వరుసం బక్షికులంబులో వాయసంబు
ప్రౌఢి నలుకాలిజీవుల రాసభంబు
యతులలోపలం గ్రోధియు నధము లవని
నిందకుండు సర్వచండాలుం డెందునైన. 278

క. శివనామము మన్నామము
భవతారణకారణములు పంచజనునకుక్
భువి విష్ణుండే శివుం డగు
శివుండే విష్ణుండు మానిశేఖరులారా. 279

క. ననుం గొల్చుచు హరు నిందిం
చునతండును హరునిం గొల్చుచు న్నను దూషిం
చునతండు నిరయవాసతం
గను ఖరకరశశిరకరులు గలయందాంకక్. 280

వ. వెండియు హరిహరుల దూషించువారలపుణ్యాం బంత
యు బలిం జేరు నబ్బలిదైత్యున్ బంధించునప్పుడువాని
తో నిట్లంటి. 281

సీ. మురహర పురహర గురుతరదూషణం
బులు సల్పువారలపుణ్యఫలము
నీచసేవయును వాణిజ్యంబు సలుపుచు
యాయజూకులు సేయు యాగఫలము

వేదోక్త మార్గంబు విడిచి వేఱొకదారిఁ
గర్మంబు బొనర్చు తద్ధర్మఫలము
శ్రద్ధావిహీనతఁ జలుపుదానజపాది
సకలకర్మంబుల సుకృతఫలము

తే. విష్ణుకథఁ జెప్పుచుండంగ వినక చనిన
యాతఁ డొకయేఁడు సేయు పుణ్యంబుఫలము
నీకుఁ జేకుఱు నిందు సందియము లేదు
దాననిర్జితసురభూజ దనుజరాజ. 282

వ. అని వరంబొసంగితి నది గావున హరిహరహిరణ్యగర్భుల నాక్షేపింపవలవదు విష్ణుం డన శివుండన నేన యవ్వయుం డగుననున్నుఁ బేర్కొన్న సకలదురితవిముక్తి యగు సందియంబు లేదీదంపతులు మదీయనామస్మరణంబునఁ గృతకృత్యులై పరిశుద్ధిం బొరసి రని యానతిచ్చి సకలలోకనివాసులు గనుంగొన నయ్యిద్దఱను గరుడారూఢులంగా వించుకొని యథేచ్ఛముగఁ జనియెఁగాశీపురనివాసులును డెందంబులఁ గొందలంబు మాని రని రామనామమహత్త్వంబు దెల్పిన విని సూతునిం గాంచి నైమిశులు తపంబుసేయం దొరఁకొనిన చోరునివృత్తాంతం బే మయ్యె నని యడుగుటయు. 283

ఉ. శ్రీవరబాణ బాణముఖ
సేవకరక్షణదక్ష దక్షయా

గావసరపరిదారితభ
గాచ్ఛవిలోచనపూషదంత దం
తావళకృత్త్యలంకృతని
తంబధృతాహిఫణామణిప్రభా-
భావితకాయకాంతిజిత
పారదనారదశారదాంబుదా. 284

క. భాలానలకీలాచల
కేలీహృతమదన రజితగిరివరసదనా
హాలాహలనీళగళా
జాలంధరగర్వదమన శక్వరగమనా. 285

స్వాగతము. అంబరాంబర కరాబ్జకురంగా
యంబుజాప్తమిహికాంశురథాంగా
యంబుజాసనశిరోంచితభూషా
చుంబితాంఘ్రినఖసుందరవేషా. 286

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యీఁదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## పంచమాశ్వాసము



శ్రీమద్వామాసంగత
వామాంగ యనంగభసితవాసితవక్షో
ధామ గిరిధామ భువన
క్షేమంకర చిత్ప్రకాశ శివ మల్లేశా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిమునిముఖ్యుల కిట్లనియె నట్లు ఘోరనియుగ్రతపోమహానుభావంబువలన. 2

సీ. కీరమయూరకోకిలశారికాకుల
మృదునినాదవినోదమేదురంబు
ప్రసవనిష్యందమరందమత్తమిళింద
బృందగీతవ్రాతపేశలంబు

రంగదుత్తుంగచంక్రమణక్రమవిలోల
    సారంగశాబకసంకులంబు
సారసనంచరత్సారసక్రేంకార
    సారకాసారవిస్తారితంబు
తే. సాలతాలతమాలరసాలబీజ
పూరఖర్జూరగోస్తనీనారికేర
పనసరంభాదితరువరభాసురంబు
నగుచు నతనితపోవనం బతిశయిల్లె. 3

క. కరవీరంబులు పొన్నలు
కురువకములు పొగడలు కలిగొట్లు తులసియున్
మరువకములు మొదలగు వి
స్ఫురితసుమారామకములు శోభిలె నచటన్. 4

సీ. వనముల భువనపావనముల నిర్మించి
    నవని నై యువని నిశ్చలత నొందె
జీవనం బఖిలసంజీవనప్రతిభకు
    ననువుగా నమృతవిఖ్యాతిఁ జెలఁగె
ఖరత చూపఁగ నోడి ఖరకరాగ్నుల తేజ
    మెందవకళలతోఁ బొందునెఱపె
జనత మెచ్చఁగఁ బ్రభంజనత మాని సమీరుఁ
    డత్యంతమృదుగతి నతిశయిల్లె

తే. నంబరము మధుమధురస్వనంబు వినిచెఁ
జోఁ వీరుఁడు దుర్వారఘోరతపము
సలుపుమహిమంబుకతమున సాధులీలఁ
బరగె నిట్లు మహాభూతపంచకంబు. 5

క. ఖగములు శిరమున గూళ్లిడ
మృగములు శృంగములఁ గ్రుమ్మి మేనుల నొరయన్
నగముగతి కదల కాతఁడు
జగములు భీతిల్లఁ దపము సలుపఁగఁ దొడఁగెన్. 6

తే. మశకపఙ్క్తులు చీమలు మక్షికములు
కఱచి రక్తంబు గ్రోలుచు నెఱచి దినఁగ
జర్జరితగాత్రుఁ డయ్యు నిశ్చలత నతఁడు
సద్గురూక్తక్రమంబున జపముసేయు. 7

తే. ద్రుమము లనిశము కందమూలములు ఫలము
లగ్రమున నిడి నతిసేయు నమ్మహాత్ముఁ
డెన్నఁడును భుజియింపమి యెఱిఁగి యెఱిఁగి
యంఘ్రిపంబులు జడబుద్ధు లగునో కావో. 8

తే. అట్లు శ్రీరామమంత్రార్పితాత్ముఁ డగుచుఁ
దపము గావింపఁ బెక్కువత్సరము లరిగెఁ
బోయెఁ బెక్కుయుగాంతరంబులు ననేక
దివ్యవర్షాయుతములు నతిక్రమించె. 9

వ. అంత. 10

చ. త్రిదశులు తద్గభీరతయు
ధీరతయుం గని భీతచిత్తులై
యిది కడు నద్భుతంబుఁదప
మిమ్మహితాత్మునివాంఛ యెద్దియో
యది వెస సంఘటింపు మిపు
డట్లు ఘటింపక తక్కితేని నీ
పదవికి నేత యీతఁ డని
పల్కిరి శక్రునితోడ నందఱున్. 11

క. అపు డిందుఁడు మహాత్ముని
తపంబు విఘ్నంబుసేయఁ దాఁ బిలిపించెం
జపలాభతనుల గానా
ద్యపరిమితకళావిదుషుల నచ్చరలఁ దగన్. 12

వ. రంభ తిలోత్తమ యూర్వశి మేనక సుకేశి చంద్రరేఖ మదాలస చిత్రరేఖ సునయనమునిచిత్తప్రమాథిని చిత్రాంగద సువేష వపుష్మతి పుంజకస్థల మొదలుగాఁగల యప్సరఃకాంత లేతెంచి పనియేమి యానతిం డనినఁ బురుహూతుం డిట్లనియె. 13

శా. ఆరూఢి న్విజయాఖ్యతస్కరుఁడు నీ
హారాచలప్రాంతకాం
తారాంతస్థలిఁ జేయసాగెఁ దప ము
ద్యన్నిష్ఠచే దాన దు

ర్వారభ్రాంతిఁ గలంగె లోకములు మీ
రల్ దత్తపోవిఘ్న మిం
పారం జేయుఁడు మీనకేతనవసం
తాదుల్ సహాయంబుగాన్. 14

ఉ. తక్కిన సాధనాంతరవి
తానసహాయత మీర లేఁగి సొం
పెక్కఁగఁ దత్తపోబలస
మృద్ధి హరింపుఁడు నేర్పుపెంపునన్
నిక్కము దేవకార్య మిటు
నెమ్మి నొనర్చుట గారణంబుగాఁ
గ్రక్కునఁ జెందు నవ్యయసు
ఖంబు లశేషనిలింపకోటికిన్. 15

క. కోరిక నతఁ డమరత్వముఁ
గోరెనొ సురలోక మేలఁ గోరెనొ తత్తే
జోరూఢి జగము లన్నియు
సారెకు భీతిం గలంగె జవ్వనులారా. 16

ఉ. మానివరేణ్యపుణ్యలస
మానతపంబున కంతరాయసం
ధాన మొనర్చు దైవతవి
తానము లాత్మపదావనార్థమై

మానుగ యక్షరాక్షసస
మాజ మకారణవైరిసంగతిన్
మానులధర్మకర్మతతి
మానుప విఘ్నముసేయు నెప్పుడున్. 17

తే. ధీరచిత్తుఁ డవ్విఘ్నముల్ చేరనీయఁ
డప్రమత్తతచే ధర్మ మాచరించు
నట్లు గావున నత్యంతయత్నపరత
నతనిసన్నిధికిని మీర లరుగవలయు. 18

క. అని శకుని డిట్లు పలికిన
విని హర్షం బొదవఁ ద్రిదివవేశ్యామణు ల
ప్పని కియ్యకొనుచు నపు డ
య్యనఘునకును మ్రొక్కి యిండ్ల కరుదెంచి వెసన్. 19

చ. తమతమ భూషణాంబరవి
తానము కావళులందుఁ గట్టి యు
త్తమతమవాజివారణర
థవ్రజముల్ దగ నెక్కి యాత్మనృ
త్తమతమ యూఁది తాపసుల
ధైర్యము లల్లలనాడ మానిస
త్తమత మదించు చోరవరు
దండకు నేఁగిరి కాంత లందఱున్. 20

క. పల్లవులఁ గూడి కొందఱు
పల్లవపాణులు విమానపఙ్క్తులు బండ్లన్
బల్లకు లెక్క చనిరి సం
పల్లలనాసఖులుపోలెఁ బటువిభవమునన్. 21

క. నడుములు నకనకమనఁ జె
న్నడర భుజంగులభుజంబు లానికఁగొనుచున్
నడచిరి కొందఱు పణఁతులు
నడయాడెడులతలతెఱఁగున న్మందగతిన్. 22

వ. ఇట్లనేకదేవతాగణంబులును గంతువసంతులును సహాయులుగా నయ్యప్సరసలు నతిదూరం బరిగి యొడనెడం బదశ్రమంబు దీఱ విశ్రమించుచుఁ జనిరంత. 23

మ. అమితశ్రీయుతు లందుఁ గొందఱు విమానారూఢులై యేఁగుచో
దమసంభారము తారె మోచి జనుచో దల్వారి వీక్షించి చి
త్తములం దాదృశభాగ్యహీనతకుఁ జింతం జెంది రాస్వర్గలో
కమునం దేనియుఁ బుణ్యహీనులకు సౌఖ్యశ్రీలు చేకూరునే. 24

తే. ఎంతపుణ్యంబు ధరఁ జేయు నంతసుఖము
గలుగు మరువకు స్వర్గలోకమున నైన

శంకరావాసమున నైనఁ జక్రిధరుని
సదనమగునట్టి వైకుంఠజగతి నైన. 25

తే. పుణ్యగౌరవమున నాకమునకుఁ జనిన
నచట నరులకుఁ దారతమ్యమునఁ గలుగు
భోజనాంబరభూషాదిభోగసమితి
స్వర్గమున నందఱకు నొక్కసమత గలదె. 26

శా. ఆరాజీవదళాయతాక్షులు సురేం
ద్రాజ్ఞానుసారంబుచే
నారీతిం జని యంతరాంతరములం
దారూఢిమై నిల్చుచున్
సారెం దన్మునిచంద్రమాశ్రమదిదృ
క్షాకౌతుకాధీనతన్
వీరాలాపము లాడఁ జొచ్చిరి రణ
ద్వీణోల్లసత్పాణు లై. 27

శా. ఆమౌనీశ్వరు నెట్టులైన వెసఁ గా
మాయత్తుఁ గావించెదన్
రామా మామకహావభావములచే
రంజిల్లఁగాఁ జేసి వి
శ్వామిత్రాదుల నైన మోసపఱతుం
జర్చింప న న్మాచినం

ప్రేమం జొక్కనివాఁడునుం గలఁడె ధా
త్రి న్మౌనిబృందంబులోన్. 28

తే. పవనపర్ణాంబునీహారభక్షు లగుచు
బ్రహ్మచర్యవ్రతస్థులై పరగువారు
డంబుమీఱిన నాజవ్వనంబు గాంచి
సరసిజాతాక్షి నాకుఁ గింకరులు గారె. 29

వ. అని పల్కి రండు నొక్కతొయ్యలి యిట్లనియె. 30

చ. మానితపోహతి సల్పఁగ
నేనే చాలుదును మీర లేఁటికి విను మ
న్మానితరూపముఁ గని శిల
యైన న్నడచి చనుదెంచు నంభోజముఖీ. 31

చ. మునిజనవర్యధైర్యధన
ముల్ హరియింప వలంతి నేను మ
ద్ఘనకుచకుంభవిభ్రమము
గాత్రవిలాసవిశేషముం గనుం
గొనిన ననంగుబారిఁ బడి
ఘోరతపఃక్రియ లుజ్జగించి యో
తనుతరమధ్య నాకు ఘట
దాసులుగారె మునీంద్రు లందఱున్. 32

వ. అని పల్కె నంత. 33

సీ. అవతంససుమగంధ మానుతేఁటులగతిఁ
గదిసి వీనులఁ గటాక్షంబు లొరయ
ఘనసారధృతిఁ జూపు గజనిమ్మపండ్ల డీ
కొన నేచె నన గబ్బిగుబ్బ లుబ్బ
నాస్యసామ్యము గోరు హరిణాంకు నలరించు
మెలపున మృగనాభితిలక మమర
పగడంబు నిరసించు బంధుజీవమునకుఁ
బ్రిభఁ గూర్చు నరుణాధరంబు దనర

తే. నంగకాంతులు హేమభూషాపదేశ
కలన మించులచపలతఁ గని హసింపఁ
బలికె నెలఁతుక యోర్తు నెచ్చెలులతోడ
దశనహీరద్యుతులు దశత్త్వశలు గులుక. 34

చ. శుకపికశారికానికర
శోభిత మై నిఖిలర్తుపల్లవ
ప్రకరలతాంతసత్ఫలవి
రాజితకల్పతరుప్రకీర్ణ మై
యకుటిలవేదవిత్తమమ
హామునివర్యనివాసయోగ్య మై
యొకవన మొప్పుఁ జిత్రిమహి
మోన్నతి జహ్నుసుతాతటంబునన్. 35

తే. నరుఁడు నారాయణుఁడు నను పరమమహాను
లఖిలలోకహితార్థమై యచట ఘోర
తపము గావింప విబుధులు తత్తపఃక్రి
యాంతరాయంబున కుపాయ మాత్మఁ దలఁచి. 36

సీ. వాజపేయశతంబు వలనొప్పఁ జేసిన
పుణ్యులఁ గొఁగిటఁ బొందువారి
జలరుహామిత్రమండలమార్గమున వచ్చు
ధీరుల రతికేళిఁ దేల్చువారి
మొనసి యగ్నిష్టోమములు పెక్కుచేసిన
ఘనుల వాతెఱ లిచ్చి మనుపువారి
హయమేధపౌండరీకాదు లుంకువసేయు
ననఘులఁ గుచముల నదుమువారి

తే. హీనపుణ్యులఁ దముఁ జేరనీనివారి
ననుపమానతనుచ్ఛాయ నలరువారిఁ
గలశజలనిధిఁ దరువంగఁ గలుగువారి
నచ్చరలఁ బంచి రంబుజాతాక్షులార. 37

చ. పనిచిన నవ్విలాసినులు
భావము లుల్లసిలంగ నేఁగి య
య్యనఘుల యాశ్రమాంతికవ
నాంతరకాంతలతావితానసూ

తనసదనూనసూనసము
దగ్రిరజోవ్రజచంత్రిమాతిశో
భనవిలసన్మరుత్ప్రథుక
పాళు లెదుర్కొన నిల్చి రచ్చటన్. 38

తే. అంత సర్వాంతరవ్యాపి యవ్యయుండు
సంభవస్థితిలయకర్త శంఖచక్రి
పాణి శ్రీవిష్ణుఁ డాదితాపసవరుండు
నయిన నారాయణమునీంద్రుఁ డది యెఱింగి. 39

తే. నిజతపోవిఘ్న మొనరింప నిగిడివచ్చు
నమరతరుణులయవలేప మణఁపఁ దలఁచి
నిఖిలలోకైకమోహననిరుపమాన
సుందరాంగుల నిర్మించె సుందరులను. 40

సీ. వారలపదపల్లవద్యుతి కోడి యా
యివురు లంతంతకు నెఱుపుఁ దొఱఁగె
వారలకుచగౌరవస్ఫూర్తి కోడిఁగి యా
మేదినీధరములు మొదల వెఱచె
వారలముఖకాంతి మీఱఁగ లజ్జ న
య్యిందుఁ డెంతయుఁ గృశియింపఁదొడఁగె
వారలమైనిండుఁవన్నియఁ గోరి యా
హేమ మగ్గిని బడి యెత్తు దఱిఁగె

తే. వారలమృదూక్తులకుఁ దనవచనరచన
లీ డనుచుఁ గోకిలసమాజ మెంచి యందు
వాసిఁ గన్గొని యట వనవాసి యయ్యె
వారిసౌందర్య మెన్న నెవ్వారితరము. 41

ఉ. సారమృణాలచర్వణము
సల్పుచు నీటఁ దపంబుచేసినన్
సారసగర్భుఁ గొల్చినను
సద్గతిపై భవ మబ్బకున్నఁ దా
రారమణీవతంసముల.
యంఘ్రులపైఁ బడి భూషణాఖ్య చె
ల్వారుచుఁ దద్గతుల్ గఱచె
హంసకముల్ భువనప్రసిద్ధిగన్. 42

తే. చెలువలవయస్స్రవంతుల చెలువమునకు
వళులు మంజులవీచికావళులు నిజము
నాభు లావర్తమునకు ననాభు లరయ
తతజఘనతతి పులినసంతతివిభూతి. 43

తే. సతులభుజవల్లికలతోడ సమత నొంది
వెలయు బిసవిసరంబులవివర మరసి
యాబిసంబులు దిను రాజహంసతతులు
క్షీరనీరవిభాగసంసిద్ధమతులు. 44

చ. అవయవసూనవాసనల
యందముచందము చిత్రపత్త్రవై
భవములరంగు లంగదవి
భావ్యవిలాసకళాసమృద్ధియున్
దివిరి యనంగునిం ద్రిజగ
తీవిజయాఢ్యునిఁ గా నొనర్పఁగా
భువనమనోజ్ఞవేషములఁ
బూనుదు రానవపద్మినీమణుల్. 45

వ. ఇట్లు నారాయణమునీంద్రుండు నిర్మించిన మించుఁబోఁడులు సర్వావయవసౌందర్యభాసితలును నిఖిలభూషణభూషితలును నై కంజకింజల్కనిభశుభతరాంగంబులఁ గమ్మతావులుగ్రమ్మ పదియోజనంబులు వలువ నచ్చటి మునిగణంబులకు నుపచారంబులు సేయుచు నవ్వనావళి వెలింగింప వారలం గనుంగొని యమరనగరాయాతలయిన యచ్చరవెలందు లమందమందాక్షావనతవదనలై తమయందంబులు నిందించుచు. 46

ఆ. ఇట్టిరూపవిభవ మిట్టివిలాసంబు
గన్నవిన్నయదియె యెన్నఁడైన
నింతవింత గలదె యీనెలంతలసొబ
గెంచలేఁడువో విరించి యైన. 47

వ. అని పల్కుచు. 48

క. నెఱపుగ సత్తెఱవలమై
యొఱపులు గని దిగ్భ్రమంబు నొందిరి పెలుచన్
వెఱపింపఁబోయి వెఱచిన
తెఱఁ గొదవఁగ నపుడు వేల్పుతెఱవ లరుదుగన్. 49

తే. వనానినిర్మితతనుతరమధ్యలకును
వరవుడులుపోలెఁ బొల్చు యవ్వనజముఖులు
లాస్యగాంధర్వముఖ్యవిలాసకళలు
దూరముస నిడి లజ్జచేఁ దొట్రుపడుచు. 50

వ. అప్పుడు గూడినసురగణంబులుఁ దారు నప్పురుషోత్తము
ని ట్లని స్తుతియించిరి. 51

చ. శతదళసంభవాదిదివి
షద్గణపూజితపాదపద్మ సం
శ్రితజనరక్షణక్షమ కు
శేశయలోచన బాహుసారని
ర్జితసురవైరివార ముని
శేఖర నీకు నజస్రము న్నమ
స్కృతు లొగి నాచరించెదము
సేవయొనర్చెద మాదరింపవే. 52

ఆ. అవనిభార ముడుప నంబుచర క్రోడ
నరమృగేంద్ర కుబ్జ పరశురామ

జలజమిత్రవంశజన్మ హలాయుధ
బుద్ధ కల్కి తనులఁ బొదలు దీశ. 53

క. శరణాగతులను మమ్ముం
గరుణారసభరితవీక్షఁ గనుఁగొనుము భవ
చ్చరణాంబురుహస్మరణా
దరణంబులు దురితవార్ధితరణంబు లిలన్. 54

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతించిన నమ్మహాత్ముం
డి ట్లని యానతిచ్చె. 55

క. ఏమికతంబున వచ్చితి
రేమిటికిఁ బరాజయాప్తి నేపఱుకరణిన్
మీమోము లొప్పకున్నవి
తామరసదళాక్షులార తథ్యము చెపుఁడా. 56

వ. అనిన నయ్యింతు లిట్లనిరి. 57

సీ. అవధారు దేవ నీయవ్యయభవ్యత
పోహతి సల్పఁగఁ బూని యేము
నముచిశాసనుశాసనమున నివ్వనమున
కేతెంచి యిచటిపర్వేందుముఖులఁ
గని మోహితుల మైతి మెనసి వీరలఁ గాంచు
పురుషులు విభ్రాంతిఁ బొందు టరుదె
యివ్వేలందుల కేము తృణకణాకృతుల మై
యోడితి మెంతయు వ్రీడఁ జెంది

తే. యిదె శరణుచొచ్చితిమి నిన్ను నిందఱమును
హీనమతులను మముఁ గృపాదృష్టిఁ జూచి
తప్పు సైరింపు మింక నీతపము చెఱుపఁ
దరము గా దెవ్వరికి నైనఁ బరమపురుష. 58

వ. అని పల్కి రంత దేవత లిట్లనిరి. 59

క. దేవా నీవు సృజించిన
యీవెలఁదుల నమరపురవిహారార్థముగా
నీవలయు వారికతమున
దేవేశ్వరురాజ్యలక్ష్మి తిరమగుఁ దలఁపన్. 60

క. కుందనమునందు వాసన
యుందినచందమున బదరికాశ్రమ మిపు డీ
సుందరులపొందుచేఁ గడు
నందంబై సర్వజనముదావహ మయ్యెన్. 61

తే. వీర లిందుల నుండుట గారణముగ
నింత వసియింపఁగోరుదు రెల్లజనము
లీలతాంగులు లేకున్న నేఁటిత్రిదివ
మింద్రుఁ డాపట్టనం బేమి యేలఁగలఁడు.* 62

ఉ. ఈరమణీశిరోమణుల
నియ్యకతక్కిన నాకలోకముం

* దేలఁద్రోలఁదలఁచు —పాఠాం.

జేరక నీపదాంబురుహ
సేవ యొనర్చుచు నుందు మిందు నీ
సారసగంధులం దొఱఁగఁ
జన్న మునీశ్వర వీరిచెంతఁ జె
న్నారఁగ నుండెనేని శిల
యైనఁ గరంగదె మాట లేటికిన్. 63

వ. అని యిట్లు ప్రార్థించుటయు నమ్మహాత్ముండు త్రిలోక తిలకం బగుతిలోత్తమయు రంభయు నూర్వశియు ననుమువ్వురు జవ్వనుల నొసంగి యనుప నద్దేవగణంబులును నితాంతప్రీతులై వారలఁ దోడుకొని యమరావతీ నగరంబున కరిగి సుఖం బుండి రని చెప్పి యప్పడంతి యిట్లనియె. 64

తే. అఖిలసుందరవస్తువులందు ముందు
ప్రోడిమఁ దిలప్రమాణరూపముల నేర్చి
మించువేడుక ముని వినిర్మించినట్టి
యాతిలోత్తమఁ బోలు నీయంబుజాక్షి. 65

క. మునిమానసహారిణి యన్
ఘనబిరుదము గలుగుదానఁ గలికి వినుమ నను
గనుఁగొనియెనేని యమ్ముని
తనతపముఁ దొఱంగి కుంభదాసుఁ డగుఁజుమీ. 66

వ. అని యిట్టెఱంగునఁ జెలిగంటె లిఱువలు తమలో సల్లాపంబు

లాడుచు మహానుభావుం డగు నమ్మునీంద్రునితపోవనంబు
చేరంజని యప్పుడు. 67

ఆ. అఖిలజంతుతతికి నావాసయోగ్యమై
చైత్రరథముతోడ సాటి యగుచుఁ
బ్రసవఫలశలాటుభరితమై యొప్పు న
వ్వనివిలాస మరసి వనిత యంత. 68

మత్త. అత్తఱిన్ సుమగంధబంధురహారధీరసమీరముల్
మొత్తమై తమసేద దీర్పఁ బ్రమోదమేదురచిత్తయై
మత్తకోకిలశారికాశుకమంజులస్వనవైఖరుల్
చిత్తముల్ గరఁగింప నందు వసించి యుబ్బున నందఱున్. 69

వ. అంత. 70

చ. చెలువుగఁ గ్రిమ్మఱంగ మరు స్రృ
జించువిరించి దయం బికాళికిం
బలుకులు శేర్పు నొజ్జ శుక
పంక్తులకోరిక దీరఁజేయ స
త్ఫలము లొసంగుదాత యళి
పంక్తులకు న్మధు విచ్చునెయ్యపుం
జెలి ఋతురాజు మాధవుఁడు
చేరె వనావళికిన్ వయాళిగన్. 71

చ. చలదళిరావగానమును
సారపికారవకాహళీధ్వనుల్

మలయసమీరణేరితస
మచ్యవమానపరాగపూగస
ల్లలితవితానముల్ శుకశు
లచ్ఛవితోరణముల్ సెలంగి శో
భిలె వనలక్ష్మి సమ్మథుఁడు
పెండిలి యౌ శుభవేళ గావునన్. 72

చ. అలికుల మంబుదాళిగ శు
కావళి యైంద్రశరాసనంబుగా
నెలమి మరందబిందువులు
వృష్టిగ నుండ సమీరణాహతిం
గలయఁగ రాలు పూలు వడ
గండ్లుగ నెంచుచుఁ బ్రావృడాగమో
త్కలికఁ జెలంగి కేకులు ము
దంబున లాస్య మొనర్చె నామనిన్. 73

ఉ. జాతివిహీనుఁడై మధుప
జాతులఁ బ్రీతులఁ జేయువానిచే
శాతశరంబు లంది పెలు
చ న్మిము నేఁచఁగఁ బూని వారట
త్కేతనుఁ డేఁగుదెంచె సుద
తీకుచదుర్గము లాశ్రయింపుఁడీ

ఘూత్కృతిఁ బాంథు లక్కఱణి
నింపుగఁ బల్కె శుకీపికావళుల్. 74

చ. మొనసి పలాశజాలలయ
ము న్సుమనోనికరాభివృద్ధియున్
ఘనతరమాధవోన్నతిఁ బ్ర
కాశితమై విలసిల్లె నెల్లెడన్
మొనసి పలాశజాలలయ
ముఁ సుమనోనికరాభివృద్ధియు
ఘనతరమాధవోన్నతిఁ బ్ర
కాశిత మౌ టది చిత్రమే ధరన్. 75

ఉ. ఆమనికమ్మరీఁడు తతు
ణారుణపల్లవతల్లజాగ్ని *దా
నామునఁ దేఁటిబాగ్గుగమి
నాఁగి పతత్రిపతత్త్రిమారుత
స్థేమముతోడఁ గాఁచి నియు
తిం గుసుమాస్త్రము లందఁ జేసి యు
ద్దామగతిన్ జయార్థముగ
ధర్మకభూపతి కిచ్చె మక్కువన్. 76

తే. విరహిజనములపై దండువెడలు మరుని
సైన్య ♦రజ మన పుష్పరజంబు దనరె

* వాఘామత్తు—పొగరు. ♦ మనరచ్యత్ర్వమన్గళంబు—గ్రా. ప్ర.

నెఱిఁ దదాతామ్రపటకుటీనికర మనఁగ
మలసెఁ బల్లవితామ్రక్షమారుహములు. 77

క. పరికించి పంచబాణుఁడు
విరహులడెందములఁ జించి వెస నిల్పిన నె
త్తురుతోడి వంకకత్తుల
కరణి న్వ్రేలసిల్లెఁ గింశుకప్రసవంబుల్. 78

ఇంద్రవజ్రము. ఈరీతిఁ బేరామని యింపు నింపన్
గీరాళి యూసొంపులు గేరుచుం గై
వారంబు సల్పన్ వనవాటిఁగాంచన్
వారాంగనల్ చేరిరి వన్నెమీఱన్. 79

ఉ. అందుఁ జరించి రిందుముఖు
లందమునం గవలై మెలంగుచుం
గొందలిరాకులం దిని పి
కీతతి పెల్లఱవం దొలంగుచుం
జిందుమరందబిందువుల
చే నగు చిత్తడికి న్మలంగుచున్
మందసమీరవారము శ్ర
మంబు హరించుటకుం జెలంగుచున్. 80

క. ప్రమదమున విరులు గోసిరి
ప్రమదలు పయ్యెదలు దొలఁగఁ బటురభసమునన్

సుమగుచ్ఛము లని మత్త

భ్రమరంబు లురోజగిరులపై వ్రాలంగన్. 81

క. రమణీమణితతి యీగతి

సుమాపచయకేళిఁ దేలుచున్ మృదులోక్తిం

దమలో నిట్లని పల్కిరి

క్రొమరుంబ్రాయంపుసొంపు గుబ్బల నుబ్బన్. 82

తే. వెలఁది భవదీయగీతికావిలసనమున

ఘనతరంబుగ నలరెఁ బ్రేంకనపుఁదరువు

లకట వీనులు గలుగ నెం తలరునొక్కొ

యజుఁడు వీనికిఁ గల్పింపఁ డయ్యెఁగాక. 83

చ. పదములఁ దాఁచి పై నుమియ

భావములో నది యొక్కవిభ్రమా

స్పదముగ నెంచు దుర్విటుల

చాడ్పున నోలలనాలలామ నీ

పదములఁ దాఁచుచున్ మధువు

పై నుమియం బులకించెఁ జూచితే

పొదలి యశోకమున్ వకుళ

మున్ రసవత్ప్రసవచ్ఛలంబునన్. 84

తరళ. తరళలోచన నీవు కౌఁగిటఁ దార్చినం బులకించు నీ

కురువకంబులు మున్న నిన్నెదఁ గూర్చువారలఁ గాంచి య

వ్వారసుఖాగమలబ్ధికై యపవాదభీతి మునిత్వము౯
దొరఁగుమానులు సుమ్ము పుణ్యమతుల్ సమస్తజగద్ధితుల్.

ఉ. అక్క భవత్కరాబ్జమున
నంటుటచే సుమనోమనోజ్ఞమై
యిక్కజ మక్కజంబుగ మ
హిన్ సురసాలసమాఖ్యఁ జెందెఁబో
చొక్కము నీవు గన్గొనఁ బ్ర
సూనము లిచ్చినభాగ్యరేఖచే
గ్రక్కున నొక్క మ్రాను తిల
కంబయి పొల్చె వనద్రిలక్ష్మికిన్. 86

ఉ. ఇంపు ఘటిల్ల నీవు మొగ
మెత్తఁగ మెత్తఁగఁ బల్కరింపఁగాఁ
జంపకకర్ణికారములు
సారెకుఁ గ్రొన్నన లిచ్చు టొప్పె నో
చంపకగంధి తత్క్రియలు
సల్పినమాత్రఁ జెలంగి పొంగి నె
య్యంపుభుజంగు లిచ్చకన
కాంబరసంపదసొంపు పెంపునన్. 87

తే. అనుచు నొండొరుఁ బల్కుచు ననలు చిదిమి
యిందువదనలు వావిలిక్రిందఁ జేరి

యలసి యూరుపు నిగుడింప నదియుఁ బూచె
నప్రియత్నశుభావాప్తి నతిశయిల్లి. 88

తే. పువ్వుఁబోఁడులనవ్వులు పువ్వు లనుచుఁ
బలుకుసరసులమాటలు పాటి యనఁగ
వన్నె గదురంగ నున్న లేఁబొన్నగములు
వారినవ్వులఁ బువ్వులై వఱలె నపుడు. 89

తే. మధుపసంగతపున్నాగమండలంబు
వింత గనుఁగొను మని యొక్కయింతి నగిన
మద్యపులఁ గూడు పురుషసమాజ మచటఁ
దమ్ముఁ గా నెంచి లజ్జఁచేఁ దలలు వంచె. 90

క. ఆరామామణు లీగతి
నారామవిహారకలన నలరారి మన
స్సారసము లచ్ఛతరకా
సారసలిలకేళిఁ దేల సంభ్రమపడఁగన్. 91

హరిణి. కనిరి హరిణీనేత్రల్ నీరేజకైరవసంచర
ద్ఘనరుచిరభృంగీసంగీతంబు క్రౌంచబకాదిప
క్షినికరగరుద్ధ్వానోద్యద్వాద్యకేళితమై స్వజీ
వనమధురభావం బెంచ న్కెంఱుపన్యతటాకమున్. 92

చ. సరసవచోవిలాసవిల
సత్కవిపంఘసమాగమంబు దా

సరసులజీవనస్థితికిఁ
జాల నలంకృతి యారఁ దలంపఁగా
సరసవచోవిలాసవిల
సత్కవిసంఘసమాగమంబు దా
సరసులజీవనస్థితికిఁ
జాల నలంకృతి యాట చిత్రమే. 93

క. కర మొప్ప ధార్తరాష్ట్రో
త్కరమానితలీల నలరి కరిపురి కెనయై
పొరి బకసంశ్రయమహిమన్
సరి యయ్యెన్ సరసి యేకచక్రనగరికిన్. 94

తే. మీనకర్కటమిథునసమ్మిళితవృత్తి
నాకసమునకు నుద్దియై యతిశయిల్లి
పద్మకచ్ఛపమకరసంభరిత మగుట
నర్కలను యక్షపతిపురి ననుకరించె. 95

తే. స్వచ్ఛతరనీరపూరవిస్తారగరిమ
నభ్రలక్ష్మికి నిద్దంపుటద్ద మనఁగ
నలరుపద్మాకరముఁ జొచ్చి రబ్జముఖులు
వీచికావళి వళులతో వియ్యమంద. 96

ఉత్సా. ఓలమోల యనుచుఁ బలికి యోసరిల్లఁ బాయుచున్
హాళిమీఱఁ దిరిగి యంబుజాళి గేలి వ్రేయుచున్

మేలు మేలు బాల యనుచు మేలములకు డాయుచుఁ
జాలకేళి సల్పి రందు జలము కేలఁ ద్రోయుచుఁ. 97

క. తరుణులకుచగంధముఁ గ
స్తురియుం గుంకుమముఁ గరఁచి సొంపొంది సరో
వర మది గంగాయమునా
సరస్వతీసంగమంబుచందము నొందెఁ 98

ఉ. అంచితకేశపాశనిచ
యంబులయందముచంద మెంచి రా
యంచలు మేఘబృంద మని
యాడటఁ బాఱఁగ గుబ్బగుబ్బలుల్
గొంచుచుఁ జంపకప్రసవ
గుచ్ఛము లంచు మదాళిమాలికల్
వంచనఁ బాఱ నీకరణి
వారివిహారము సల్పి రంగనల్. 99

సీ. చాంపేయమంజరీస్తనియోర్తు పుష్పాడి
నెఱపి తుమ్మెదమూఁకఁ బఱవఁజేసె
చంద్రాస్య యొక్కతె చంద్రికాస్మితరుచి
పరగ జక్కవగవఁ బాఱనూఁకెఁ
గరియాన యొక్కతె కరమునఁ బెకలించి
యంబుజాతంబులందంబు మాన్చె

ఘననీలవేణి యొక్కతె జలంబులు సల్లి
కలహంసవిసరంబు ద్రోలఁగఁ దోలెఁ
తే. ప్రకటతరలీల నాత్మీయచికురనికర
చకచకద్రుచికుచయుగావికలముకుళ
చకితహరిణేక్షణప్రభాప్రకరసుకర
గమనసామ్యపరిస్పర్ధ గందళింప. 100
సీ. కంకణాహతులచేఁ గంకణంబులు మీఁది
కెగయింపఁ దొడఁగె నీమగువ యనుచు
నూర్మికప్రతతిపై నూర్మికల్ నటియింపఁ
జేయీఁత నేర్చె నీచెలువ యనుచు
నుత్పలపత్త్రాళి నుత్పలపత్త్రముల్
గదిసె నేఁ డీయిందువదన యనుచు
వేణిలోపల నదె వేణి శైవలలీల
వఱలెడు నీకీరవాణి యనుచుఁ
తే. గర్ణికఁగఁ దాల్చెఁ గర్ణికఁ గలికి యనుచు
నళికి నీకంబుకంఠి దా నళికె ననుచు
సారసాక్షులు సారకాసారనీర
కేళిఁ దేలుచుఁ బలికిరి కేలి సల్పి. 101
వ. ఇట్లు విహరించి కొలంకులు వెలువడి వచ్చి. 102
ఉ. తీరధరిత్రి నిల్చిరి ర
తిపప్రభుఁ డీభువనంబు గెల్వ నిం

పారఁగ నీరఁ బ్రుఙ్గడిగి
　　　　నట్టి శరంబు లనంగ నంగనల్
వారికచంబులం దొరఁగు
　　　　వారికణంబులు డంబుమీఱె న
వ్వారిధరంబులం బొడము
　　　　వట్రువముత్తెపుఁ మొత్తమో యనన్. 103

వ. యథోచితవివిధాలంకారంబుల నలంకృతలై మరలి చను
　　దెంచు నవసరంబున. 104

చ. తిర మగునర్మకోపములు
　　　　దీఱనియోరనె తెల్లవాఱుటన్
సురతమహాశచేఁ గలఁగు
　　　　సుందరులన్ వరులం బొసంగఁ దా
నిరవుగఁ గూర్చువేడ్కనన
　　　　హేళి జగద్ధితభావ మేర్పడం
గిరణము లొయ్య నొయ్య ముడిఁ
　　　　గించుచు నేఁగెఁ బ్రతీచిచెంతకున్. 105

క. జలజిని గలసిన యలయిక
　　మెలపారఁగఁ దీఱ విశ్రమించెనొ నా ని
మ్నల నపరాద్రి నిలిచె వెలుఁ
　　గులగని తదశోకతనుమునుగుచ్ఛము సరణిన్. 106

తే. సమదమందేహదేహముల్ సమరధరణి
నద టడఁచి రక్తసిక్తాంచితాంగుఁ డగుచు
నడరి యానల్ల గడిగికో నరిగె ననఁగఁ
గమలమిత్రుఁడు పడమటికడలి మునిఁగె. 107

చ. అడరు తమోనిశాటునకు
నంజి దివాకరుఁ డేఁగె నిర్భ్యోడం
దడసిన మోసమా యిచట
దాయలమాయల నంచు నెంచుచుం
గడుఁ గృశియించి నెవ్వగఁ గ
శాపికలై సతులం దలంచి లో
నడలెడు కోకలోకవిర
హాగ్ని యనం దగె సాంధ్యరాగముల్.108

క. అరిగె నినుం డిదె దోషా
కరుఁ డగు నోకరాజు వచ్చుఁ గనుఁ డనుగతిఁ బ
క్షిరవంబు చెలఁగ భీతిని
సరసీరుహములు మునింగె జలదుర్గములన్. 109

ఉ. వారక లోనఁ జొచ్చుతఱి
వారిజరాజి ముడుంగ నందు వే
సారుచుఁ జిక్కు తేఁటిగమి
సామిశరీరము లొప్పె నయ్యెడన్

వీరుఁడు మారుఁ డధ్వగుల
వేమఱు నేమఱ కేయ నెత్తు పం
కేరుహబాణకోణపరి
కీలితలోహశలాకలో యనన్. 110

సీ. ధవసమాగమసముత్కంఠితకై రవి
ణీవిభూషితహరినీలమణులు
విరహిభయంకరస్మరచాపనిర్గత
ఘనమృగీమదగుళికాగణములు
పద్మినీవిరహాగ్నిభ్రమనవ్యశిఖిశిఖా
బృందసంభవధూమకందళములు
* హేళిహితాన్వేషణేచ్ఛాంధకారసం
ప్రహితనిశాచరప్రణిధివితతు

తే. లమృతకరసంగవిముఖతావాప్తి రచిత
మూర్తి మత్కంజపుంజదుష్కీర్తిలతలు
సలిలలక్ష్మీకనీనికాసముదయములు
మెదలెఁ గొలఁకుల నపుడు తుమ్మెదలగుదులు. 111

ఉ. అంత నిశావిలాసిని ప్రి
యాగమనోత్కలికానుమోదిత
స్వాంతమునం గురంగమద
చర్చితయై యట తారహారముల్

* హేధి (తి?)—పాఠాం.

వింతగఁ దాల్చెనో యనఁగ
విన్నను మన్నను నొక్కచాయఁగా
ధ్వాంతము నిండఁ బర్వఁ బయిఁ
దారకలు న్విలసిల్లె నల్లనన్. 112

చ. తిమిరము చుక్కచాలుఁ బొడ
తెంచుట గానఁగనయ్యె నయ్యెడం
గొమరుగ రాజు వచ్చె నిదె
కొల్వున కంచు వెసం బితృప్రసూ
సమయభుజిష్య మి న్ననుహా
జారము కస్తురిపూఁత నల్కి ము
త్తెము లను రంగవల్లికలు
దీర్చె ననం గడు రంగుమీఱుచున్. 113

సీ. దేవతాంతరభావనావిదూరద్విజ
తతికి నిష్టముఁ గూర్చు మతి చెలంగ
నరిసముచ్చయగర్వనిరసనప్రౌఢిచేఁ
దఱసుదర్శనదీప్తి తాండవింప
నమరావనక్రియాయత్తమై విలసిల్లు
ఘనకరవిభవంబు గందళింప
నిజయోగబలమున నిఖిలజగత్తమః
ప్రకటనోద్ధతి వకావకలు గాఁగఁ

తే. జంద్రికామందహాసంబు చౌకళింప
నిచ్ఛలంబుగ నురమున మచ్చ దనరఁ
గువలయానందసంధానగుణనిరూఢి
విధుఁడు ప్రాద్దిశఁ గనుపట్టె విధునికరణి. 114

తే. మెండుగా నబ్జజాండకరండమునకు
సారఘనఘనసారంబుచంద మొంది
పండువెన్నెల కన్నులపండు వగుచుఁ
దనరెఁ గుముదంబులకును ముదంబు గదుర. 115

క. జీవంజీవచయంబుల
జీవము లలరించి చంద్రశిలలు గరఁచి రా
జీవములతోన పాంథుల
జీవంబులు గుందఁజేసె శిశిరకరరుచుల్. 116

వ. అయ్యవసరంబున నచ్చరలేమ లవ్వనంబున నొక్కసమ
స్థలంబునఁ గనకప్రాకారగోపురాంచితంబును మణిస్తంభ
సంభృతసుందరమందిరాన్వితంబును బ్రతోళివేదికాయు
తంబును నగు నొక్కపురంబు నిజమాయాబలంబున
నిర్మించి యందు నిల్చి సర్వాలంకారసంయుతలై పల్ల
వులం గలసి యుల్లంబు లుల్లసిల్ల యథేష్టదివ్యభోగంబు
లనుభవించుచుఁ గ్రీడించుచుండి రంత. 117

తే. శౌరి సద్గుణములసిరుల్ గొనుచు రాజు
చక్రిపాలన మొనరింపఁ జాల కరిగెఁ

గోరి సద్గుణములసిరుల్ గొనుచు రాజు
చక్రిపాలన మొనరింపఁ జాలు నెట్లు. 118

ఆ. ప్రణయకలహకుపితరమణీమణీకర్ణ
కులిశ మగుచుఁ దనరి కుక్కుటార
వంబు చెలఁగెఁ జక్రవనజాతములకు మి
త్రాగమంబు దెల్పు నదియుఁబోలె. 119

శా. అంతం బాపతరంగిణీతరణి స
ద్వ్యాంభోజమిత్రుండు దు
ర్దాంతధ్వాంతవనీవిభావసుఁడు దై
త్యవ్రాతచేతస్తమో
దంతిస్తోమవికర్తనుండు ఖచర
త్ప్రఖ్యాతహంసుండు భా
స్వంతుం డల్లనఁ దోఁచెఁ బూర్వగిరిపైఁ
జక్రావనప్రక్రియన్. 120

వ. ఆసమయంబున నఖిలకపటకళావిశారదలును వీణావాదన
ప్రవీణలును లాస్యతాళలయాభిజ్ఞలును నైన యప్సరః
కమలాస్యలు బంగరురంగు లీనుమెఱుంగుమేనుల రవణం
బులు డంబుగాఁ దోఁడివి జాంబూనదాంబరంబులు గట్టి
కుంభికుంభంబుల నుల్లసంబాడు కుచకుంభంబుల గంధ
సారఘనసారకస్తూరికాద్యనులేపనంబు లలవరించి నిద్దంపు
టద్దంబులు సూచి మధురమధురఫలాహారంబునం దృప్త

లై కీరంబులకు నేరుపులు గఱపుముద్దుపల్కుల సహం
పూర్వికాగర్వాలాపంబులు పల్కుచు మేళంబులం గూడి
చని యమ్మునీంద్రుతపోవనంబుం బ్రవేశించి రంత. 121

క. కరుణాకరుండు రఘువరుఁ
డరిభీకరుఁ డవనిజాసహాయుం డపు డా
తరుణుల భ్రమయించుటకుం
గర మరుదుగ నొక్కమాయ గల్పించె వెసన్. 122

క. ఆదేవదేవు మాయా
యాదోరాశి న్నిమగ్నులై యంబుజగ
ర్భాదులు చొక్కఁగ నొరులకుఁ
గా దని యమ్మాయ యెట్లు గడవఁగవచ్చున్. 123

వ. అమ్మాయామహామంబుకతంబున నిందీవరదళప్రభుండును
జగత్ప్రభుండును గోటికందర్పవిలాసుండును బీతవాసుం
డును మందహాససుందరవదనారవిందుండును గోవిందుం
డును వనమాలికాశోభితుండును సీతాలక్ష్మణసమేతుం
డును నైన రాఘవుం డాజవ్వనుల కవ్వనంబునం బ్రతి
దుమంబునం గనుపట్టుటయు. 124

పంచ. సురేంద్రనీలనీరదాభశోభనాంగునిన్ ధను
ర్ధరుం గృపాకరున్ ఖరాదిదైత్యరాజభీకరున్
సరోజపత్త్రనేత్రు రామచంద్రుఁ గాంచి తన్మనో
హరాంగసంగమంబుఁ గోరి రంగజార్తి నంగనల్. 125

తే. ఇతనిఁ గౌఁగిటఁ గదియించి రతులఁ దేలి
యతులసౌఖ్యంబుఁ జెందుద మని తలంచి
తరువుతరువున కరిగిరి తరుణు లపుడు
తరువుకాఁ డయి మరుఁడు తత్తఱము సేయ. 126

తే. సనకముఖ్యమునీంద్రులు గనని రామ
చంద్రు వీక్షించి రాపూర్ణచంద్రవదన
లారులకార్యార్థముగఁ బూని యరుగుదెంచి
తార కాంచిరి లాభం బుదారనియతి. 127

క. కలుములచెలువకు నైనం
గలుగని యారామదేవుకౌఁగిలి దమకుఁ
గలుగునె తరువులచెంతకు
బిలబిలలుగఁ జనినమాత్రి బింబోష్ఠులకుఁ. 128

వ. అని చెప్పి సూతుం డిట్లనియె. 129

తే. ఆవెలందులభాగ్య మే మనఁగవచ్చు
నఖిలవేదాంతసంవేద్యుఁ డయినరాముఁ
గాంచికృతకృత్య లయిరి జగంబునందు
వఱలునే యిట్టివిభవ మెవ్వరికి నైన. 130

క. లలనామనోజు రాముం
లలనామణు లాత్మలం దలంచుచు యోగీం
ద్రులకై నఁ దుర్లభ మగు
నలఘుసుఖాంబునిధి నోలలాడిరి వేడ్కన్. 131

చ. అపుడు నెలంత లీకరణి
నాత్మపురాతనపుణ్యభూతిచే
నపరిమితానురాగమున
నారఘువీరునిఁ జూచి యాపురా
ణపురుషు నవ్యయుం దనమ
నంబున నిల్పి గరిష్ఠనిష్ఠచేఁ
దప మొనరించుచున్నముని
తల్లజుచెంతకు నేఁగి రందఱున్. 132

వ. ఇట్లేఁగి. 133

మ. భసితోద్ధూళితగాత్రుఁ బాటలజటా
భారాంచితున్ శాంతు ధై
ర్యసమగ్రుణ్ నియతుం ధృతాక్షవలయుం
రామాంఘ్రిసంసక్తమా
నసుఁ గృష్ణాజినవల్కలావృతతను
న్నాసాగ్రదృష్టి న్నిర
స్తసమస్తాఘు జితేంద్రియుం గనిరి య
త్తన్వంగు లాతాపసుణ్. 134

వ. మఱియు ననేకనియమంబులు నడపుచు సర్వభోగంబుల
యందు విరక్తుం డయినకతంబునఁ బ్రతిపచ్చంద్రునిభంగిఁ
గృశాకారుండై ఘోరతపంబు సేయుటం జేసి జ్వలజ్జ్వల
నసంకాశుండై నివాతస్థితదీపకళిక తెఱంగునఁ జలింపక

తపఃప్రభావంబునఁ జతుర్దశభువనంబులు భీతిల్ల స్వస్తికా సనంబునం గూర్చుండి రామనామజపాసక్తుండై యున్న యవ్విజయాఖ్యమునీంద్రునకు నంటియంటి యంజలిచేసి యక్కంజవదన లతనిం బరివేష్టించి వేణువీణామృదంగ తాళాద్యపూర్వవాద్యంబులు వాయించుచు సురగణం బులు మెచ్చ నఖిలప్రాణిమనోహరంబుగా గానంబు సేయుచుండి రగ్గానాదికళ లహస్కరునియందు నీహార వారంబునుంబలె నమ్మహాత్మునియందు వ్యర్థంబు లగు టయు ననంతరంబ. 135

చ. నెలఁతలు రంగమధ్యమున
నిల్చి విలాసవిశేషవైఖరుల్
వెలయ మృదంగతాళముఖ
విశ్రుతవాద్యరవంబు గీతికా
విలసనముం బ్రవర్తిలఁగ
వేడుక నాంది తగం బఠించి తా
ళలయసమన్వితప్రతిభ
లాస్యము సల్పఁదొడంగి రుద్ధతిన్. 136

చ. పదములఁ దాళవైభవము
భావము కన్గవ మేన గానసం
పదయును దద్వరాభినయ
పద్ధతి పాణులఁ జెంగలింపఁ గం

జదళవిలోచనల్ తపసి
　　　　చక్కి నటించిరి మించి వేలుపుల్
చదలున గుంపులై భరత
　　　　శాస్త్రవిధిజ్ఞులశిక్ష మెచ్చఁగన్. 137

క. తెలిపి గనరాక యెంతయుఁ
దఱచుగ వనవైభవాంబుదవ్రజమున న
త్తఱిఁ జెలువొందెం దొలకరి
మెఱపులయొఱపు లయి వేల్పుమెలఁతలమేనుల్. 138

ఆ. కందుకములరీతిఁ గడువడి నెగయుచుఁ
బుడమిఁ బడుచుఁ దిరిగి పడి నెగయుచు
భామ లపుడు చక్రబంధలఘుత్వప్ల
తాదిగతులు వెలయ నాడి రంత. 139

ఉ. చెక్కుల ఘర్మబిందువులుఁ
　　　　జెన్నగుభూషణమౌక్తికంబులుం
బెక్కుతెఱంగులం గలయ
　　　　భేదము గానక భేదభావకుల్
చొక్కఁగఁ దారహారములు
　　　　చొక్కపుగుబ్బలఁ దాండవింపఁ దా
రక్కజమైనలీలఁ గమ
　　　　లాస్యలు లాస్య మొనర్చి రింపుగన్. 140

ఉ. ఏపున నంగవైకృతియు
హెచ్చను గుందును జెంద కీగతిం
జూపఱు లెంచి యొంచి మదిఁ
జొక్క నటించి మునిన్ భ్రమింపఁగా
నోపక గీతనర్తనస
మున్నతు లెల్ల నిరర్థకంబులై
యేపఱఁ జూచుచుండి రపు
డెంతయుఁ జింతఁ గలంగి యంగనల్. 141

వ. పరబ్రహ్మదర్శనంబు సిద్ధింపనివానికి శుక్తియందు రజతంబును మరుమరీచికయందు సలిలంబును దోఁచునట్లు విషయంబుల సుఖభ్రమంబు గలుగుంగాక పరబ్రహ్మరసాభిజ్ఞునకు మిథ్యాభూతంబులగుసుఖంబులు నిక్కంబులని భ్రమ గలుగనేర్చునే యితండు రామబ్రహ్మరసజ్ఞుండు విషయసుఖంబులఁదగులునే వృథాప్రయాసంబు నొందితి మనుచుఁ దలంచుచు. 142

సీ. అంబరాభరణమాల్యానులేపనములు
లాస్యసంగీతవిలాసకళలు
భాసురతరహావభావాదిచేష్టలు
నలసయానంబు దృగ్విలసనంబుఁ
గచకుచయుగనాభికక్షవిస్ఫూర్తియు
మహనీయమృదువచోమధురతయును

మెఱపులు నెఱపు నెమ్మొనిబెడంగులు
మొలకనవ్వులును గెమ్మోవిరంగు

తే. లంబుజాతాక్షులకు నాయుధంబు లుర్వి
నవియు విజయాఖ్యహాసేందు నలపలేక
కుంటువడుటయు లజ్జించి కువలయాక్షు
లొయ్య నెడగిలఁ జని నిల్చియుండి రంత. 143

వ. ఇట్లు సురసాధారణకాంతలు నృత్యంబు సల్పి చాలించి
సభయై కూర్చుండిరి తదనంతరంబ. 144

తే. మంజుఘోష సుకేశియుఁ బుంజకస్థ
లయుఁ దిలోత్తమయును మదాలస మనోర
మయును రంభయుఁ జిత్రలేఖయును మొదలు
గల్గు నచ్చర లాటకుఁ గణఁగి రపుడు. 145

మ. వనితల్ చందనవారిసిక్తమును ది
వ్యదుప్రసూనాంచితం
బును గృష్ణాగరుధూపదీపితమునై
పొల్పొందు రంగస్థలం
బునకున్ వచ్చిరి సొంపుమీఱఁ మధురం
బౌవిల్లుఁ దుం దోడరా
ఘనతం బాదసరోజనూపురరవ
త్కారంబు దోరంబుగన్. 146

చ. అలరులతావిఁ బూని జల
జాకరముల్ తెగ నీఁది కప్రిపుం
బలుకుల మెట్టి పుష్పాదులఁ
బాఱఁగ నూఁకి మరందబిందువుల్
పలుమఱు నాని యాత్రిదివ
పద్మదళాక్షులమీఁద సల్లనన్
నెలకొని వీచెఁ జందనవ
నీకమనీయమరుత్కిశోరముల్. 147

సీ. కాల మార్గ క్రియాంగ గ్రహ జాతి క
ళా యతి ప్రస్తార లయ లనంగఁ
గలుగు దశప్రాణకలితమై తాళంబు
విలసిల్లు గాన తద్విధము దెలిసి
చంచత్పుటంబును జాచపుటోద్ఘట్ట
* షట్పితాపుత్త్రకసంజ్ఞ లనఁగ
నెసఁగెడుతాళంబు లేకోత్తరశతంబు
దనరారఁ గుండలీదండలాస్య

తే. కందుకావ్హాయ హల్లీసకము లనంగ
వెలయు నృత్యంబులను దేశివిధముఁ గూర్చి

---

*షష్ఠితా—అని ప్రాఁతప్రతి- షట్పితా—పుత్త్రిక అనియు సంగీత-
శాస్త్రములందు భిన్ననామములు గానవచ్చుచున్నవి.

లాస్య మొనరించి రక్కమలాస్య లెలమి
భరతశాస్త్రప్రవీణత పరిఢవిల్ల. 148

వ. వెండియుఁ బతాక త్రిపతాకార్ధపతాకకర్తరీముఖ మయూ
రార్ధచంద్ర కపిత్థ కటకాము ఖాద్యసంయుతహస్తంబు
లిరువదియేడును *బుష్పపు టాంజలీచతురశ్ర స్వస్తికాది
సంయుతహస్తంబులు పదియాఱును మెఱయించి గీతప్ర
బంధంబుల యర్థంబు లభినయించుచు షడ్జ మధ్యమ
గాంధారాది సప్తస్వరంబులఁ జెన్నొంది షాడ వౌడవ
సంపూర్ణంబు లన వెలయు స్త్రీపురుషభేదంబులం బరగు
ద్వాత్రింశద్రాగంబులుం దన్మిత్రంబులును వేళానిర్ణ
యంబు లెఱింగి పచరించుచు స్థాయి సంచారి వ్యభిచారి
సంజ్ఞల నొనరు దృగ్విభేదంబు లభినయించుచుఁ గుంచి
తావనత కంపిత సమాఖ్యలం జెలఁగు శిరోభేదంబులును
నెఱయఁ జక్రాదిభ్రమణవిశేషంబులు గల నృత్యంబు
ద్రుత మధ్య విలంబితరీతుల నేత్రశ్రోత్రశుభావహంబుగా
ననేకగతులం జూపి రంత. 149

క. మృగపక్షితరులతావలి
యగణితహర్షమును జెందె నయ్యాశ్రమ మిం
పుగ నమరావతి కెవడిఁ
బొగడొందె న్నృత్యగీతములయ్యున్నతులన్. 150

* పుష్పపుటమంజరీ—వ్రా. ప్ర.

తే. అపుడు రంభోర్వశీప్రముఖాప్సరోవి
లాసినులలాస్యగానవిలాసకళల
జంతుసంతతి మోహవిభ్రాంతిఁ జెందె
నొసర విజయాఖ్యమానీంద్రుఁ డొకఁడు దక్క. 151

వ. ఇట్లు బ్రహ్మానందసందోహనిమగ్నుండై నశ్వరంబులైన సుఖంబులం దగులక నిశ్చలభావుండైన యమ్మునిని వంచింపనేరక యత్తలోదరులు దమలోన. 152

క. ధృతియుతుఁ డగు నితని తపో
హతిఁ జేయఁగ నేరమైతి మమరావతి కే
గతి మరలం జని యలసుర
పతియెదుటను నిల్చి యెట్లు పల్కుదుము తగన్. 153

తే. హీనజనములపోలికి నింపుదఱిఁగి
యకృతకార్యులమై యెట్టు లరుగవచ్చు
బలనిషూదనుఁ డెమ్మెయిఁ బలుకునొక్కొ
యనుచు నొండొరుఁ బల్క నయ్యవసరమున. 154

వ. మున్ను వారలచే నవమానిత యైన యొక్కమానిని యిట్లనియె. 155

క. గానాదికళలఁ ద్రిజగ
న్మానితరూపమున నలరుమగువలు మీరే
మౌని భ్రమయింపనేరక
పూని మిగుల వగల నొగలఁ బోలునె మీకున్. 156

ఆ. ఇతనితపముఁ జెఱుపఁ జతురత లేదె మీ
కితఁడు కాశికాధిపతినిభుండె
నను దిరస్కరింపఁ జనుఁగాక మీ కొండు
పనుల నేర్పు గలదె వనితలార. 157

క. ధనదర్పంబున నవయౌ
వనదర్పంబునఁ జెలంగువార లెదిరిఁ ద
మ్ము నెఱుంగక నిందింపుదు
రనిశము మీ తెఱఁగునన్ దురాగ్రహవృత్తిన్. 158

వ. అని యిట్లు కలవరించి కలకంఠులకలకలంబు వారించిన
నొక్కమహామతి యగు హేలావతి వారల కిట్లనియె. 159

తే. సంగయుతుఁ డయి యతి చెడు సంగహీనుఁ
డగుచు విజ్ఞానసంపన్నుఁ డయ్యెనేని
కళల రేరాజు పూర్ణతఁ గాంచుకరణి
నవ్యయానందసంపూర్ణుఁ డయి వెలుంగు. 160

వ. గృహస్థుండు దక్కఁ దక్కినయాశ్రమస్థులకు సంగంబు
వర్జింపవలయు విశేషించియు నిస్సంగవృత్తి మెలంగక
మెలంగు యతీశ్వరుండు సంగగుణంబున గృహియును
యతియుం గాక యుభయభ్రష్టుండై మృత్యువశంబును
బొందు నీయర్థంబుఁ దెలుపు నితిహాసంబు నొక్కటి
గలదు వివరించెద వినుండు. 161

తే. ఒక్కవిప్రుండు వైరాగ్యయుక్తచిత్తుఁ
డగుచు సంసారసుఖముపై నాత్మ రోసి
సర్వవస్తువికారాళి సన్న్యసించి
యరిగె భిక్షాశి యగుచు దేశాంతరంబు. 162

తే. అతఁడు డెబ్బదిరెండేఁడు లరుగుకతన
సకలభూవలయంబును సంచరించె
నియతభోజియు నిర్జితేంద్రియుఁడు నై ని
జాశ్రమోచితవృత్తిచే నశ్రమమున. 163

క. ఈవిధిఁ జని భువిఁ గలతీ
ర్థావళి యఖిలంబు దిరిగి యాతం డొకచోఁ
దేవార్చనంబు సలిపెడు
దేవాభుని నొక్కధరణిదేవునిఁ గాంచెన్. 164

ఉత్సా. కాంచి యట్లు పూజసేయఁ గల్గు మోక్షలక్ష్మి నా
కంచు వార్ధకమునఁ దిరుగ నగునె యింక నంచు లో
నెంచి యొక్కయూరఁ జేరి యెలమి నందు మఠము గా
వించి దేవపూజసల్పు వేడ్క చెంగలింపఁగన్. 165

తరువోజ. వలను మీఱఁగఁ బట్టు వస్త్రసంగ్రహము
వారకచేసి యవారితభక్తి
నలరు మనీషచే నయ్యతివర్యుఁ
డట నొకనాఁటికే యమూల్యాంశుకంబు

నెలుకలు గొఱికిన నీక్షించి చింత
యెసఁగంగఁ జేష్టావిహీనతఁ గుంది
కలుషీకృతాత్ముఁడై కడు వగఁ జెంది
కర్తవ్య మేమియుఁ గానక పొరలె. 166

వ. ఇట్లు మూషకదూషితంబైన యవ్వస్త్రంబుం గాంచి శోకించి మార్జాలవర్ధనంబున నెలుకలం బిలుకుమార్చిన నిమ్మఠంబు నిర్భయావాసం బగు నని వితర్కించి యతండు.

సీ. మూషకప్రతతిపై రోషంబు గదుర బి
డాలకిశోరంబు నోలిఁ బెనిచె
నయ్యాఖుభుక్కిశోరావనార్థము పాలు
పిదుక నిమ్మగు నొక్క మొదవుఁ గొనియె
నాసారభేయిఁ గాయఁగఁ గట్ట దక్షుని
నొక్కగోపాలకు నొనరఁ గూర్చె
నావల్లవునకు నెయ్యంబున నన్నంబు
గావింప నొకవిప్రకాంతఁ దెచ్చె

తే. వంటకట్టియల్ దేరఁగ వలను మిగుల
సారబలు నొక్కశూద్రుని సంగ్రహించె
నిందఱకుఁ బని గఱపఁగ నిద్ధబుద్ధి
యైన భూసురు నొక్కని నలవరించె. 168

ఆ. అప్పుడు లబ్ధభిక్షుఁడై వీరి నందఱ
నేట్లు మనుపువాఁడ నే నటంచుఁ

కుశలులైన కర్షకులఁ గూర్చి యరిగోలు
విడుచుకృషి యొనర్పఁదొడఁగె నతఁడు. 169

తే. వీతరాగత యంతయు వీటిఁబోయె
సంగసంపదఁ దొల్లిటిచందముననె
కలిగె నొకపట్టువస్త్రంబు కారణముగ
నిరయగతుఁ డయ్యె నయ్యతి తరుణులార. 170

తే. అర్థ మొనగూర్చుకతన మోహంబు వొడముఁ
దాన స్మృతివిగ్రహంబగు దాన బుద్ధి
తొలఁగుఁబో దాన దుర్గతి దొడరుఁ గాన
యతికి నర్థార్జనాదికృత్యములు గీడు. 171

వ. వెండియు. 172

చ. ధన మొనగూర్చి మానవుఁడు
త్యాగము భోగము సల్పఁడేని య
ద్ధన మొరుపాలగుం బిదపఁ
దానును బన్నము నొందు మక్షికల్
పనుపడ సంగ్రహించి తముఁ
బాఱఁగ నూఁకిన మాక్షికంబుఁ దా
రెనయక డించి ముచ్చిరుచు
నేఁగినకైవడిఁ గాననస్థలిన్. 173

ఆ. ధర్మ రాజ వహ్ని తస్కరుల్ నలువురు
భ్రాత లర్థమునకుఁ బాలివార

లందు నగ్రజాతు నవమాన మొనరింపఁ
గినుక వొడము ముప్పు రనుజులకును. 174

తే. ధర్మహీనుఁడై గృహియును ధనము సంగ్ర
హించి యతియును జెడిపోదు రిది నిజంబు
కాన నిస్సంగులై జితకాము లగుచు
యతులు చరియింపవలయు మోక్షానురక్తి. 175

మ. అనఘుం డీతఁడు రామభద్రభజనా
యత్తైకచిత్తాబ్జుఁడై
మును తాపత్రయిఁ బోవ మీఁటి కనుద
మ్ముల్తాత్మసీ నిస్సంగవ
ర్తనఁ జేయందొడఁగెం దపం బిటులు ని
ర్వాణాంగనం గోరు నీ
ఘనుఁ డాశించునె యన్యకామినులసం
గం బంగజభ్రాంతుఁడై. 176

క. రాముఁడె కర్తయు భోక్తయు
రాముఁడె యనుమోదకుండు ద్రష్టయు శ్రీమ
ద్రాముండె సర్వమును నని తా
నీముని గూర్చున్నవాఁ డహీనసుఖేచ్ఛన్. 177

వ. కావున నితని మోహితునిం జేయు మనతరంబు గాదు
పోవుద మని తెల్పిన నాసుందరు లందఱు నతం డెందు
శాపం బిడునో యని వెఱచుచుఁ జని సురనగరంబున కరిగి.

యావృత్తాంతం బంతయు విన్నవించినఁ జిత్తగించి దివ
స్పతి బృహస్పతినిం జూచి యిట్లనియె. 178

తోటకము. ఈనియతాత్ముని నేగతి గల్గుఁ
మానుగ దేవగణంబుల కెమ్మై
మానితహర్షసమగ్రిత గల్గుఁ
ధీనయసంపదఁ దెల్పు మహాత్మా. 179

వ. అనిన నతం డిట్లనియె. 180

తే. అతనికత నీకు భయ మేల యమరరాజ
యతఁడు వల్మీకమునఁ బుట్టి యతులతేజ
మమర వాల్మీకి యనఁగ బ్రహ్మర్షి యగుచు
నెలసి రామాయణము సేయఁగలఁడుసుమ్మి. 181

వ. అనిన నింద్రిం డిట్లనియె. 182

ఆ. తనదుమేనితోడ మనుజుఁ డచ్చెరువుగ
నెట్లు పుట్టఁ బుట్టు నిదియుఁ గాక
బహుళజన్మదుర్లభం బగు విప్రత్వ
మెట్లు గలుగు నతని కెఱుఁగఁజెపుమ. 183

వ. అనిన నతనికి గురుం డిట్లనియె. 184

ఉ. చీమలు పాము లీఁగలును
జేరఁగఁ జెందఁగ రానియట్లుగా
నామహాతాత్మ్ముమేనిపయి
నావరణంబుగ నొక్కపుట్ట శ్రీ

రాముఁ డొనర్చు భక్తజన
రక్షణదక్షుఁడు గాన వాతవ
ర్షామితబాధ నొందక తఁ
డందు వసించు ననేకవర్షముల్. 185

తే. అతఁడు కారణదేహాపర్యంత మట్ల
దగ్ధకల్మషుఁడై యందుఁ దపము సల్పి
యంతఁ గ్రమ్మఱ దివ్యదేహంబు దాల్చి
పుట్టు బ్రహ్మర్షి యగుచు నప్పుట్టయందు. 186

వ. కులశీలాదిధర్మంబులును విధినిషేధంబులును స్థూలదేహం బునందుఁ గలుగుం గాని లింగదేహంబునందుఁ గలుగ నేరవు పరమాత్మం డయ్యైశరీరంబులఁ బ్రవేశించి యజ్ఞానావృతుండయి జీవుం డనంబరగు నద్దేహాదిబంధంబులు జ్ఞానంబునంగాని కర్మంబునం దెగ వజ్ఞానంబునం జేయు కార్యంబులు జ్ఞానంబున నిర్వర్తింపందగు లింగశరీరభంగంబున సర్వోపాధివర్జితుండయి జీవాత్ముండు ముక్తుం డగు సత్యానందసంయుక్తుండైన యతనికి స్వరూపసంస్థితియే ముక్తి యనంబడు జ్ఞానేంద్రియంబులును గర్మేంద్రియంబులును బ్రాణంబులును మనంబునుగూడ నీపది యాఱును జీవోపాధి యనంబరగు మహాత్ములయిన మును లును దపోధనులును బరలోకభీతులై తదుపాధిభంగంబు నకై తపోవిద్యయజ్ఞాదికర్మంబు లాచరింపుదు రయ్యు

పాధియే సంసారకర్మదేహులఁ నూర్ధ్వాధోలోకంబులఁ
ద్రిప్పుచుండు నని తెల్పిన విని వాసవుం డిట్లనియె. 187

తే. అట్లు సంసారకారణంబగునుపాధి
మఱి తపోనియమాదికర్మములఁ జెడఁగ
స్వర్గమును నిరయంబును సంఘటించు
పుణ్యపాపంబు లెద్దానఁ బోలియుఁ జెపుమ. 188

వ. అనిన గురుం డిట్లనియె. 189

ఆ. అఖిలజన్మకృతము లయినకర్మంబులు
పొసఁగి గోడమీఁది పూఁతవోలె
నంటియుండు జీవు నవియు జ్ఞానంబునఁ
బోవవలయు నుల్లిపొరలమాడ్కి. 190

క. ఎప్పుడు సమ్యగ్జ్ఞానం
బుప్పతిలు న్నరున కద్వయోర్జితమతిచే
నెప్పుడు విడుచు న్నియమం
బప్పుడె తత్కర్మనాశ మగుఁ ద్రిదివేశా. 191

వ. మఱియుఁ బ్రారబ్ధంబులును సంచితంబులును నాగాములు
ననఁ గర్మంబులు మూఁడువిధంబులై పరగు జ్ఞానంబు
వొడమెనేనియు దేహనాశంబునఁ బ్రారబ్ధంబును జ్ఞానా
గ్నివలన సంచితంబునుం జెడు స్థూలసూక్ష్మదేహనాశం
బున నాగామికర్మంబుమొదలింక లే దని తెల్పిన విని
శతక్రతుం డిట్లనియె. 192

ఆ. సకలకర్మవితతి జ్ఞానాగ్నిఁ జెడునేని
యనఘ జ్ఞాన మొదవినట్టివారు
నాచరింపుదురు శుభాశుభకర్మముల్
వారి కెట్లు ముక్తి వఱలుఁ జెపుమ. 193

వ. అనిన గురుం డిట్లనియె. 194

సీ. జ్ఞానవంతుం డగువాని కెల్లప్పుడు
సుఖము దుఃఖమ్మును సోఁకకుండు
కాలినచేలంబుకరణి నిస్సారమై
యమ్మహాత్మునిదేహంబు దనరు
మఱి బాలులీల నున్మత్తునిగతిఁ బిశా
చముపోలె నాతఁడు సంచరించు
సలిలకణంబులు జలజపత్త్రముఁబోలెఁ
బుణ్యపాపంబులు పొరయ వతని

తే. జ్ఞానసంపదఁ గొనియాడు మౌనిగణము
జ్ఞాన మెవ్విధముననైన సంగ్రహింప
వలయు నది వెలిగా నపవర్గలక్ష్మి
కల్పకోటిశతంబులఁ గలుగ దవని. 195

వ. జ్ఞానంబు వేదాంతశ్రవణంబునంగాని గలుగదు కావున వేదాంతవంతుండు పవిత్రచరిత్రుండును విగతకల్మషుండును బూజార్హుండును ముక్తిభాజనుండును నగు నతనికి స్పృష్టాస్పృష్టదోషంబులు లేకయుండు వెండియు. 196

తే. పన్నెతక్కువ హేమంబు వహ్ని యోగ
మహిమఁ గుందన మగుగతి మహితరామ
మనుజపంబున నఘకదంబములఁ దోలి
యాపుళిందుండు ద్విజుఁ డగు నమతవర్య. 197

క. దురితనిపినాగ్ని శిఖ యై
పరగెడు శ్రీరామమంత్రభజనపరుం డే
ధర వసియించుం దద్ధర
సొరిదిం బదియోజనములు శుద్ధతఁ గాంచున్. 198

ఆ. రామ యనిన యక్షరద్వయం బెపుడుఁ బ
ఠించుజంతువితతి గాంచు ముక్తి
కలుషమానసులకుఁ గలియుగవేళలఁ
గలుగ దితరధర్మకర్మములను. 199

చ. ఇరువదియొక్కమాఱు నరుఁ
డేపున రామజపంబు సల్పినన్
ధరణిసురు న్వధించుదురి
తంబు దొలంగు నిరంతరంబు సు
స్థిరనియమోన్నతిన్ జపముఁ
జేసి యవిప్రకులుండు విప్రతా
గరిమఁ జెలంగు విప్రుఁడు సు
ఖస్థితి ముక్తిఁ గనుం బురందరా. 200

తే. నిత్య మష్టోత్తరశతంబు నియతి రామ
జపము సల్పిన నరుని దోషములు డిందు
నయ్యనఘుఁడు జీవన్ముక్తుఁ డతని కబ్బు
రామసారూప్యముక్తి పులోమదమన. 201

వ. అనిన నింద్రుఁ డిట్లనియె. 202

క. రాముఁ డనఁగ నెవ్వఁడు త
న్నామవ్యత్యస్తజప మొనర్చి పుళింద
గ్రామణి ద్విజుఁడై యొనరుచు
రామాయణపుణ్యకథ తెలుఁగ గట్టిదయో. 203

వ. ఆరామాయణపారాయణంబు చేసినవారికి నెట్టిఫలంబు
చేకూరు నిది యంతయు వివరింపు మనిన బృహస్పతి
యతని కిట్లనియె. 204

సీ. ముక్తికతోరణమాలికాచ్ఛచ్ఛవి
పరికరచంద్రాతపరాజితంబు
సకలరత్ననిబద్ధసదనసమంచిత
వీథికాసాహస్రవిలసితంబు
పరివిమలానందవైభవశోభితశ్రీశ
సారూప్యజనలోకసంకులంబు
ననిరుద్ధసంకర్షణాహ్వయప్రద్యుమ్న
వాసుదేవవ్యూహభాసురంబు

తే. కంజరాగాదినవరత్నకనకఖచిత
సాలవిరజానదీఖేయసలలితంబు
దురితకృత్పంచజనవర్గదుర్గమంబు
గురుతరానందకరము వైకుంఠపురము. 205

ఆ. ఆపురంబునందు హరిభక్తులను గర్మ
మరసి శిక్షసేయు ననుదినంబు
సర్వధర్మవిదుఁడు సంకర్షణుఁడు కామ
దాయకుండు దండధారి యగుచు. 206

చ. స్థిరమతిఁ బూర్వజన్మములఁ
జేయు తపోనియమాదికర్మన
త్కరుణతఁ జేసి మానవుల
ఘప్రకరంబులఁ బాఱ మీఁటి శ్రీ
హరిచరణాబ్జభక్తిఁ జెలు
వారుదు రమ్మహిమంబునన్ రమే
శ్వరనిలయంబుఁ జేరుదు ర
వారణదివ్యవిమానయానులై. 207

తే. అమ్మహాత్ములు లోభమోహాదికలనఁ
జేయుదురితంబు లరసి శిక్షించుచుండు
ఘనతరప్రాభవుండు సంకర్షణుండు
పుణ్యపాపంబు లెఱిఁగినప్రోడ గాన. 208

వ. అని తెల్పిన విని యుధిష్ఠిరుం డిట్లనియె. 209

క. శమనుండు ప్రాణికోటులఁ
దమియింపఁగఁ గర్త యగుచుఁ దనరారఁగఁ బా
పములయెడ శిక్ష యిడ నే
క్రియమున సంకర్షణుండు గర్త యగు రహిన్. 210

వ. అనిన నతనికి గురుం డిట్లనియె. 211

క. హరిమంత్రోపాసకులున్
హరిపూజారతులు నిర్మలాచారులు శ్రీ
హరినామపాఠకులు దం
భరహితు లనహంకృతులును బరహితమతులున్. 212

తే. మఱియు సంసారసంతాపమగ్ను లయ్యుఁ
బూతమతులయి కుమ్మరపురుషులట్లు
తనరు సత్పథరతులు నుత్తరపదమున
నరుగుదురు హరిపదమున కసురదమన. 213

ఉ. ఎచ్చటఁ బూరుషోత్తములు
నింతులు సంతతమున్ శుభాకృతిన్
నిచ్చలు నుందు రెచ్చట వి
నిర్మలచంద్రిక శర్మహేతువై
యచ్చపుఁదెల్వి నింపమరు
నట్టియుదగ్దిశ నుండులోకముల్
గ్రచ్చర దాఁటిపోవుదురు
కంజదళాక్షునిఁ బ్రోలి కుబ్బునన్. 214

వ. ఇట్లు దివ్యవిమానంబు లారోహించి వైకుంఠంబునకుం
జని యందుఁ బుణ్యపాపపరీక్షకుం డైన సంకర్షణదేవు
చేత శిక్షితులై పరిశుద్ధిం బొరసి నిత్యానందమయం
బైన విష్ణుమందిరంబునఁ బునరావృత్తిరహితులై సుఖం
బుండుదురు వెండియు. 215

సీ. హరిహరదూషకు లయినపాషండులు
నిజకర్మవిముఖులై నెగడుగృహులు
దేవభూదేవతాదీనహింసకులు ని
ష్టాపూర్తకర్మముల్ సలుపుఘనులు
దానశీలురు పరద్రవ్యంబుచే ధర్మ
మాచరింపఁ దొణంగు నట్టినరులు
మర్యాద విడిచి కామక్రోధసంగతిఁ
దామసవర్తనఁ దనరుయతులు

తే. నంధకారావృతము ధూమబంధురంబు
నయిన దక్షిణమార్గంబు నందు నరిగి
యటఁ దమోమయలోకస్థు లనుపఁ ద్రోవ
నార్తిఁ బడి చేరుదురు సమవర్తిపురము. 216

వ. అందుఁ జిత్రగుప్తసహాయుం డైన యమునిచేఁ బుణ్యపా
పంబు లేర్పరింపంబడి యంత. 217

తే. పుణ్యగౌరవమున స్వర్గమునవసించుఁ
గల్మషాధిక్యకలన దుర్గతులఁ జెందుఁ

బుణ్యపాపసమస్థితిఁ బురుషసమితి
వెండి భూలోకమునఁ బ్రభవించుఁ జూవె.  218

వ. అనిన విని యీదుర్గిండు యతీంద్రు లెట్టిగతిఁ జెందుదు
రని యడిగిన నతనికి గురుం డిట్లనియె.  219

తే. సర్వజీవదయాళులై శాంతిదాంతి
నిష్ఠులై వీతరాగులై నెగడుయతులు
సత్యలోకంబునకును దత్సరణి నరిగి
యంత వసియింతు రజునిసభాంతరమున.  220

వ. అందు వేదాంతశ్రవణంబు సేయుచుండి యవ్విరించితోఁ
గూడఁ గైవల్యంబుఁ జెందుదు రని చెప్పి గురుం డిట్లనియె.

క. ఆద్యవ్యూహప్రభుఁడుఁ
సద్యుమ్నుఁడు నయిన యాదిసంకర్షణుదం
డోద్యుక్తిన్ శుద్ధతఁ గని
ప్రద్యుమ్నవ్యూహమునకు భక్తాళి చనున్.  222

క. ప్రద్యుమ్నుఁడు వారలకుఁ
సద్యస్సారూప్య మొసఁగి సకలాగమసం
వేద్యం బగు నిజపదమున
నుద్యత్కరుణావిభూతి యొనరఁగ నునుచున్.  223

ఉ. చక్రగదాసిశంఖములు
శార్ఙ్గము పాణులఁ జెంగలింప ని

ర్వక్రిపిశంగచేలమును
వారిజనేత్రములున్ బలాహక
పఙ్క్తిమనీలగాత్రమును
భాసిలఁ గౌస్తుభభూషితాంగులై
చక్రిస్వరూపముక్తిఁ గని
శక్రి వసింపుదు రందు నాథునుల్. 224

ఉ. ఒక్కొకవేళ దానవస
ముత్కరముల్ సురలం గలంచి పే
రుక్కన నొంచి తత్పదము
లాక్కొమొగిం గొనఁ గాందిశీకులై
యక్కుటిలాసురాధమకృ
తామితబాధలు విష్ణుఁ డున్న బల్
దిక్కన కేఁగి చెల్పుదురు
దేవత లం దనిరుద్ధుతోడుతన్. 225

క. దివ్యులచందంబు తృతీ
యవ్యూహాధీశుఁ డైనయనిరుద్ధుం డా
కవ్యాదిహర్తయును లో
కవ్యాపియు నైన హరికిఁ గ్రమమునఁ దెల్పున్. 226

క. ఆహారియానతిచేఁ బల
లాహారులఘోరదర్ప మడఁచి చతుర్థ

వ్యూహపతి వాసుదేవుం
డాహావమునఁ ద్రిదశవరుల నందఱ మనుపున్.      227

తే. బలవిభేది! యనావైకుంఠపట్టనమున
నంబుజాయతలోచనుఁ డనఘుఁ డజరుఁ
డమరగణపూజితుఁడు విష్ణుఁ డధివసించు
నది చతుర్దశభువనముల్ మనుపఁగోరి.      228

మ. వనజాతాక్షుఁడు రామరూపమున తే
వం గ్రీడ గావింప నా
యనఁ జిత్తాబ్జమునం దలంపఁగఁ దదీ
యప్రేరణం జేసి పా
వనచిత్తుల్ సనకాదిసన్మునివరుల్
వైకుంఠముం జేరఁగాఁ
జని రంభోరుహజన్మమానసభవుల్
సద్వంద్యు లిచ్ఛాగతిన్.      229

క. వేదాంతవిదులు సూనృత
వాదులు *నిర్మమములు దీనవత్సలులు సనం
దాదిమునిప్రవరులు చని
రై దేఁడుల ప్రాయ మమర ననఘతరాత్ముల్.      230

వ. ఇట్లు సనకసనందనసనత్కుమారసనత్సుజాతులు చను
దెంచుచు.      231

---

* నిర్మలులు—పాఠాం.

చ. కనుఁగొనఁగల్గె నేఁడు హరిఁ
 గౌస్తుభశోభితవక్షు యోగిహృ
ద్వనజనివాసుఁ జక్రధరు
 వారిజనేత్రుని నంచుఁ బల్కుచున్
వనరుహనాభుమందిర మ
 వారణఁ జొచ్చి ప్రమోదసంపదల్
దనుకఁగ నమ్మునీశ్వరులు
 ద్వారము లేడును దాఁటి రిమ్ములన్. 232

చ. భయదగదాధరుల్ విమత
 భంజనతీవ్రపరాక్రము ల్ప్రభా
మయు లరుణాబ్జలోచనులు
 మందరమేరునగోపమాంగు ల
వ్యయబలశోభిదీర్ఘభుజు
 లంబుజనాభునిద్వారపాలకుల్
జయవిజయాఖ్యు లానియమ
 సాంద్రులఁ గన్గొని విస్మితాత్ములై. 233

మత్త. వీర లెచ్చట నుండి వచ్చిరొ విశ్వమోహనమూర్తులై
శ్రీరమాధిపపట్టణస్థలిఁ జేరఁ గైతవలీలచే
దారకాకృతి నేఁగుదెంచిన దైవతాసురవీరులో
నీరజాప్తమహోమహోమహనీయు లుగ్రతపోమయుల్. 234

ఉ. వీరలు బాలురయ్యు శత
వృద్ధులపోలిక నున్నవార లి
క్కారణ మేమియో యరయఁ
గాఁ దగు స్వామిహితంబు దప్పఁగా
నేర మటంచు నొండొరులు
నెట్టనఁ బల్కుచు దండహస్తులై
యారస మొప్ప వారిఁ జన
నీయ కడల్చుచు నాఁగి రక్కునన్. 235

క. అమ్మాడ్కి నివారితులై
యమ్మానులు రాగమత్సరాన్వితులుబలెన్
మ మ్మిప్పు డీవిష్ణునిగే
హమ్మునకుం జొరఁగనీయ కాఁగం దగునే. 236

వ. అని పల్కి వారలం జూచి. 237

తే. అవని మీరలు రక్కసు లై జనించి
కోపకామాదియుక్తులై కుటిలవృత్తి
నఖిలలోకంబులకు బాధ యాచరింపుఁ
డని శపించిరి క్రోధతామ్రాక్షు లగుచు. 238

క. అట్లగిదిన్ శాపం బిడి
యాపుణ్యులు క్రోధ ముడిగి యాదటఁ బశ్చా
త్తాపసమన్వితులై చిం
తాపరవశు లగుచు నిట్లు దలపోసి రొగిన్. 239

మత్త. సారధీరతఁ జారుచర్యల జ్ఞానసంపద మీఱి సం
సారసాగర ముద్ధరించిన సజ్జనాళియు విష్ణుమా
యారసాబ్ధిఁ దరింప నోప రయారె జ్ఞానసమృద్ధిఁ బెం
పారియుం దగఁ గ్రోధవంతుల మైతి మేమిపు డక్కటా.

తే. ప్రళయమున నంబుమయము లై పరగుమాడ్కి
జగము లన్నియు హరిమయం బగుట యెఱిఁగి
యేల వచ్చితి మిచటికి నేల దండ
వారణం బబ్బెఁ గ్రోధంబు వఱల నేల. 241

సీ. మానావమానముల్ మఱిపుణ్యపాపముల్
సుఖదుఃఖవృత్తులు క్షుత్పిపాస
లతులనిద్రాసంగమాహారకలనలు
తృప్తియును విధినిషేధములు భయము
భోగసంపద మూఢబుద్ధియు గురుశిష్య
భావంబులును మహాప్రాజ్ఞతయును
నీచజన్మంబును నెఱిఁ గులీనతయును
రూపవైభవముఁ గురూపతయును

తే. సకలవర్ణాశ్రమాచారసంగ్రహంబు
గలుగుచుండు నహంకారకారణమున
వెస నవిద్యామదోన్నతి విద్యవలనఁ
బాపఁదగు శుద్ధబుద్ధులై పరగువారు. 242

తే. విడిచిపెట్టినపూఁదండ నెండి గొనిన
గతి నహంకృతిఁ గ్రమ్మఱ మతి వహించి
శాప మొసఁగితి మత్యంతచాపలమున
నేమి సేయుద మిఁకఁ దెరువేది మనకు. 243

మ. అని చింతింపఁగ శంఖచక్రధరుఁ డు
ద్యత్పీతవాసుండు స
ద్వనమాలాంచితుఁ డవ్యయుండు నిఖిలాం
తర్యామి లక్ష్మీశ్వరుం
డనఘుం డచ్యుతుఁ డిందనీల*మణినీ
లాంగుండు శ్రీవిష్ణుఁ డా
ఘనులం గన్గొనవచ్చెఁ గౌస్తుభవిభా
కాంతాఖిలాశాంతుఁడై. 244

వ. అంత. 245

తే. ఎవ్వఁ డేనియు నొకవృద్ధుఁ డేఁగుదేర
యువజనప్రాణములు చను నూర్ధ్వమునకు
నెదురు చని వారలకు దండ మిడిన మగుడ
నవి యథాస్థానముల నిల్చు ననిరి గాన. 246

క. అపు డాశ్రీనాథుఁ బురా
ణపురుషు నీక్షించి యాసనందాదిమునుల్

* ఘన—పాఠాం.

విపులభయభక్తి మెుప్పిక్కురి
యపరిమితజ్ఞానవంతు లగుచు సుఖేచ్ఛన్. 247

అంత వ్యూహనాథులను వైకుంఠసద్వాసులను నిజభృ
త్యులను విలోకించి యవ్విష్ణుం డిట్లని యానతిచ్చె. 248

అఖిలలోకములకు నవనీసురోత్తము
లాచార్యు లారాధ్యు లనఘులార
జగతి వారలఁ బూజ సల్పి యాపిమ్మట
మత్పూజ సల్ప సేమంబు గల్గు
వారలఁ దొఱఁగి యెవ్వరిఁ బూజచేసిన
నాపూజ నిష్ఫలం బగుఁ దలంప
భూసురముఖమున భుజియింతు నెప్పుడు నే
వారిపూజలఁ దృప్తి వడలు నాకు

విప్రవరులను ననుఁగ భావింపవలయు
వారలకు నాకు నెన్నఁడు వేఱు లేదు
స్థావరాదికపూజల సంతతంబు
నేను భుజియింపుదును వారి కిడినకరణి. 249

అపరాధరహితులై స
త్యపరాయణు లయినయట్టి ధరణీసురులం
గృపలేక బాధ సల్పిన
కపటాత్మునివంశ మెల్ల ఖండింతు వెసన్. 250

తే. ఏను గోత్రిధించి నొంపంగ నేల యందు
వృజిన మంతంత కెక్కుడై వృద్ధినొందు
మానవులకును విప్రావమానవహ్ని
యేమకులములదాఁక దహించుఁజుండి. 251

ఆ. శాంతచిత్తుఁ డయిన సద్విప్రు నవమాన్యుఁ
జేసి నిరయమున వసించు నరుఁడు
సిరియు నాయు వణఁగుఁ జెడు ధైర్యసంపద
మహదతిక్రమమున మాన్యులార. 252

ఉ. కావున విప్రవర్యుల క
ఖండితభక్తి నమస్కరింతు నే
నీవిధి మీరు మొక్కుఁ డని
యేర్పడ వారల కెల్లఁ జెప్పి యా
శ్రీవరుఁ డమ్మహామునులఁ
జేరి నమస్కరణం బొనర్చి సం
భావన చేసి యి ట్లనుచుఁ
బల్కెను సాంత్వనసుస్వనంబునన్. 253

శా. ఈవేళ న్నిఖిలాగమాంతవిదులై
యింపొందు మీరాకచే
నీవైకుంఠ మకుంఠపావనతచే
నేపారె మీపాదరా

జీవాపారపరాగయోగమహిమం
జెన్నొందె మన్మందిరం
బోవాచంయములార నాయశము నేఁ
డొప్పారె లోకంబులన్. 254

తే. ప్రాజ్ఞపాదపరాగసంప్రాప్తి కలన
ననిశపావనమహిమచే నలరు నెద్ది
యదియె భవనంబు తత్ప్రాప్తి నలరదేని
యది భకారంబు దొఱఁగినయదియె తలఁప. 255

తే. భవసహస్రసముద్రసేతువును ఘోర
విపదనూనతమిస్రరవిచ్ఛవియును
గోర్కు లిడుకామగవియు నై కొమరుమిగులు
విప్రపదధూళి నన్నుఁ బవిత్రుఁ జేయు. 256

క. అవనీసురు నిందించుట
యవమానముసేత నన్ను హరునిన్ మిము ని
ట్లవమాన్యులఁ జేసిన య
య్యవమతితప మేల జపము లవి యేఁటి కిలన్. 257

వ. అని పల్కి విష్ణుండు వెండియు. 258

ఉ. నాయపరాధముల్ క్షమ యొ
నర్పుఁడు నాదగుభృత్యు లియ్యెడన్
మీయెడఁ దప్పుఁ జేసి రవ
నీస్థలి భృత్యులదుర్వినీతిచేఁ

బాయక జేఁడు దుర్వ్యశము
పా లగు నోయతులార యోతప
శ్శ్రీయుతులార నన్నిపుడు
చెందనె భృత్యకృతాపరాధముల్. 259

చ. పతిహితవర్తియుం జతురు
పాయసమర్థుఁడు నైన భృత్యుఁ డీ
క్షితిపయి నుత్తముండు పతి
కిం బ్రతికూలము లాచరించి నం
తతము స్వతంత్రకృత్యుఁ డగు
దారుణభృత్యుఁడు భృత్యమాత్రుఁడే
కృతమతి యైనయప్పతికిఁ
గేవలమ్మృత్యువు గాక యారయన్. 260

క. మిత్రుండు కళత్రంబును
బుత్త్రుఁడు భృత్యుండు సుగుణభూషితు లయినం
బాత్రం బగు నృపపతికి
ధాత్రి న్నరుఁ డాపదబ్ధిఁ దరియించు వెసన్. 261

క. క్షమియింపందగు మీరలు
క్షమ సత్యము క్షమ తపంబు క్షమ గల్గినయా
విమలుఁడు పూజ్యుం డతనికి
క్షమయే స్వర్గంబు క్షమచె జగములు మనుపున్. 262

క. ఎలపాపియము ధనవిద్యలు
గులము స్థిరయగతిఁ జేర్చుఁ గ్రోధాంధుల న
య్యెలపాపియము ధనవిద్యలు
గులముఁ స్వర్గంబుఁ జేర్చుఁ గ్రోధరహితులన్. 263

ఉ. పూని క్షమాయుతుల్ భువన
పూజ్యులు వారు వసించుధారుణి
న్నెను నజుండు శంభుఁడును
నెమ్మి వసింతుము సంతతాక్షముల్
స్నానము సంధ్యయుం జపము
సల్పినసేని నిరర్థకం బగున్
జ్ఞానులకున్ ద్విజాతులకు
శాంతియె పెన్నిధి యెల్లభంగులన్. 264

వ. కావున భృత్యకృత్యం బయిన మదీయాపరాధంబు క్షమి
యింపవలయు ననిన సనకాదు లిట్లనిరి. 265

సీ. స్వామి భవద్భృత్యవరుల శపించిన
యపరాధవంతుల మక్షముులము
దండనీయుల మేము త ప్పొనరించితి
మీగతి నుతిసేయ నేల మమ్ము
వైకుంఠనగరికి వచ్చియు ని ట్లకృ
త్యము సేయుమవలసెఁ గ్రోధంబుకతన

ధర నకృత్యంబు కృత్యముగతిఁ దోఁచుఁ గృ
త్య మకృత్యరీతిచే నమరుఁ గ్రోధి

తే. కందళముఁ గ్రోధి రక్కసునట్లు తోఁచు
నట్లు గావున నిఖిలలోకాపకారి
యైన క్రోధంబు విడువంగ నగు మనీషి
యంత్యజుని దూరముగఁ బాయునట్టికరణి. 266

వ. అనిన వారికి భగవంతుం డిట్లనియె. 267

తే. కలుగుఁగా కేమి క్రోధంబు గడఁక నది య
కాలకీలితముగఁ జేయఁ గాదుగాక
యుచితవేళఁ బ్రయోగింప నొప్పగు నదె
దీనిఁ దెలియంగవలయుఁబో ధీరమతులు. 268

తే. శాంతి ముందుకునైన నావంత లేక
యెవ్వనికిఁ గ్రోధ మనయంబు నివ్వటిల్లు
శమనుఁ గనుఁగొనునట్టిచందమున వానిఁ
గని జగంబులు భీతిల్లు ననఘులార. 269

వ. ఈయర్థంబునకు దృష్టాంతం బగు నొక్క యితిహాసంబు
వివరించెద వినుండు. 270

శా. శర్వాంశప్రభవుండు పాటలజటా
జాలుండు తేజోమయుం
డార్వాగ్నిప్రతిమానకోపకలితుం
డచ్ఛాచ్ఛభస్మాంచితా

ఖర్వాంగుండు త్రినేత్రభాసురుఁడు ది
గ్వాసుండు నై యెప్పుడున్
దుర్వాసుండు చరించు లోకముల శా
ర్దూలాజినాచ్ఛాదియై. 271

శా. సర్వానుగ్రహనిగ్రహప్రతిభుఁడై
శశ్వత్తపోరాశియై
దుర్వాసుండు చరింపఁ గాంచి బెగడొం
దున్ శాపశంకాప్తిచే
నుర్వీభృత్సరిదర్ణవార్కశశితా
రోగ్రగ్రహాహీంద్రగం
ధర్వాధీశసురాసురప్రభృతినా
నాజంతుసంతానముల్. 272

క. గర్వంబు దొఱఁగి నేను సు
పర్వజ్యేష్ఠుండు హరుఁడు భయకలితులమై
దుర్వాసుఁ గనినయప్పుడు
దుర్వారవ్యథఁ గలంగుదుము మునులారా. 273

వ. వెండియు నతండు సర్వభోగంబులయందు విరక్తుండై
తపఃప్రభావంబునఁ గామంబు గెలిచి క్రోధంబు నవలం
బించి యఖిలలోకసంచారంబు గావించు చుండు నతని
శాపాగ్ని నజాండభాండంబులు నీఱగు నట్టిప్రభావం

బునం దేజరిల్లుచు నమ్మహాత్ముం డొక్కనాఁ డిట్లని
చింతించె. 274

క. మునులును దివిజగణంబులు
మనుజులు నాగాధిపులును మతిఁ గ్రోధాగ్నిన్
మునిఁగిరి దీనిఁ దొఱఁగి నే
ననుపమసౌఖ్యాబ్ధిఁ దేల్తు నన్నిజగములన్. 275

వ. అని క్రోధపరిత్యాగంబునందుఁ గృతనిశ్చయుండై క్రోధా
ధిదేవత నాశ్రయించిన నదియు నతని దేహంబు వెడలి వచ్చి
యెదుట నిల్చి గడగడ వడంకుచుఁ గృతాంజలియై యి
ట్లనియె. 276

క. మునికుంజర నను నిపుడే
పనికిన్ రప్పించితిరి కృపామతిచేఁ గ్రొ
క్కన నానతిండు మీరా
సనమున కసియింతు నే నజస్రము భీతిన్. 277

తే. భువనములు మద్వశంబునఁ బొలిచియుండు
సంయమీశ్వర భవదీయశాపపవన
సఖశిఖాళికి వెఱచి మీచాయ నుంటిఁ
గాని తడ వొక్కచో నుంట గాదు నాకు. 278

వ. అనిన నమ్మునీంద్రుండు నీవు నాదేహంబున నుండక వెడ
లిపొమ్ము నిన్ను విసర్జించి శాంతుండనై సుఖంబున
నుండెద ననినఁ గ్రోధాధిదేవత యిట్లనియె. 279

తే. నేను వసియించుకతమున నిఖిలలోక
పూజితుఁడ వయి సుఖసిద్ధిఁ బొదలె దీవు
కలిగె నాకారణమునఁ బ్రఖ్యాతకీర్తి
యేల విడిచెదు నన్ను మునీంద్రచంద్ర. 280

వ. అనిన నతండు నిన్ను విసర్జించుటయ నాకు నత్యంతసు
ఖావాప్తి నీవు గ్రక్కునం జను మని పల్కిన నదియు
నప్పుడ యంతర్ధానం బొనరించె నంత. 281

క. నిరహంకృతిచేఁ గ్రోధో
ద్ధురతఁ దొలఁగె శాంతుఁ డయ్యె దుర్వాసుఁడు బం
ధురకరుణాంచితమతి యను
సరుదగు నివ్వార్త ప్రమోసె నఖిలజగములన్. 282

వ. అంత నద్దుర్వాసుండు. 283

ఉ. ఆవిధి శాంతిదాంతియుతుఁ
డై యమరావతి కేఁగ మొ్రక్క సం
భావనసేయఁ డయ్యె బల
భంజనుఁ డంతఁ దొలంగిపోయి య
బ్భావిబుధుండు వెండి యొక
ప్రొలికి వేగమె యేగి యచ్చటన్
వావిరి ద్వారపాలకని
వారితుఁ డయ్యె మహాద్భుతంబుగన్. 284

వ. ఇట్లు క్రమక్రమంబునఁ జతుర్దశలోకంబులుం దిరిగి యెందునుం బూజగానక యతండు చింతించుచుండె నంత.

తే. దండమొక్కరుఁ డొకఁడు కమండలువును
గొనిరి వల్కల మొకరుండు గొనుచుఁ బాఱెఁ
బరిహాసించె నొకండు చప్పట్లు గొట్టె
నుమిసె నదుర్మానియెదుట వే ఱొక్కరుండు. 286

తే. భుక్తి యిడువార్త దూరమైపోయె నతని
కెచటికేఁగిన నిర్భీతి నచటివార
లపహసింపంగ వనమున నైన నిలువ
నెడమ్ము లేదయ్యెఁ గ్రోధంబు విడుమకతన. 287

వ. ఇట్లఖిలక్లేశంబులం బొంది యతం డొక్కనాఁడు తన మోసంబునకుఁ జింతించి వెండియుఁ గ్రోధాధిదేవత నాకర్షించి దాని కిట్లనియె. 288

శా. దేవీ నీవు దొఱంగి చన్నకతనం
దేజోవిహీనుండనై
యీవిశ్వంబునఁ జుల్కనైతి వగ నెం
తేఁ గుందితిం గ్రమ్మఱన్
నీవాసందమున న్వసింపు మిదె నా
నెమ్మేన నీయుండుటన్
నే విఖ్యాతి వహింతుఁ బూర్వగతిచే
నిర్వ్యాజతేజోమయీ. ౨౨౧

క. అని పలుకఁగ విని యపుడా
యనగాత్రము సొచ్చి వెలిఁగె నదియుఁ దదాజ్ఞన్
మునుపటికన్న న్మిక్కిలి
మునియును దేజఃప్రదీప్తమూర్తిఁ జెలంగెన్. 290

వ. అది గావున. 291

ఆ. ఉచితకాలములఁ బ్రయోగింపఁబడు క్రోధ
మలరుఁ గామధేను వగుచు నదియ
యనిశసంప్రయుక్త మై క్లేశకర మగు
జగతిలోన మానిచంద్రులార. 292

మ. మీర లర్చిన సర్వసత్క్రియలు నె
మ్మిం జేయుట ల్మాని యీ
ద్వారాధ్యక్షు లనల్పదర్పకలసన్
వారించి యిట్లు రయో
వీరల్ చేసినతప్పు లోఁగొని జగ
ద్విఖ్యాతకారుణ్యతన్
మీ రీశాపవిముక్తికి న్మతి విని
ర్మింపం దగుం జెప్పెరన్. 293

వ. అని విప్రశాపంబు నివారింప సమర్థుం డయ్యు భావికా
ర్యంబుకతంబున నిట్లు పల్కినహరిం జూచి సనకాదు
లిట్లనిరి. 294

క. కడలేనిభవస్మాయా
జడధిం దిరుగుదురు కమలజప్రముఖులు సొం
పడరఁగఁ గీల్బొమ్మలకై
వడి నే మది ద్రాఁట నెంతవార మనంతా. 295

ఆ. నిఖిలలోకములు వినిర్మించి మనిచి హ
రించులీలఁ బొదలి మించునట్టి
నీదుభృత్యవరుల నియమింపఁగలమె నీ
కింకరులము జలచరాంకజనక. 296

వ. అనిన విష్ణుం డిట్లనియె. 297

ఉ. వీరలు దైత్యజాతిఁ బ్రభ
వించి సురద్విజకోటి నొంచి ప
ల్మాఁటు జగత్త్రయిం గడుఁ గ
లంచి జనిత్రయిఁ దాల్చి యందు నా
చే రణభూమి నీల్గి యటఁ
జేరుదు రప్పుడు మత్పదంబు నే
నారసి వీరి కిట్లు మఱి
యాద యొనర్చితి శాపముక్తికై. 298

తే. వీర లుద్ధతులై జగద్వీతతి కెల్ల
నార్తి యొనరింపఁగలరు నే నట్టివేళ
రామకృష్ణాదిరూపముల్ పేర్మిఁ దాల్చి
హింససేయుదు వీరల నెత్తిఁగొనుఁడు. 299

వ. అని యానతిచ్చిన నట్ల యగుంగాక యని సనకాదు
లద్దేవునకు మ్రొక్కి యథేచ్ఛం జని రంత వైకుంఠవాసు
లెల్ల హాహాకారంబుసేయుచుఁ గనుంగొన నాజయవిజ
యు లచ్చటనుండి పడి దితియందుఁ గశ్యపునకు హిర
ణ్యాక్షహిరణ్యకశిపులై జనియించి బ్రహ్మదత్తవరంబు
నఁ గ్రొవ్వి లోకంబులకు బాధయొనరింపుచుండి రంత. 300

మ. మదమత్తాసురులీసురాలయము శుం
భద్దర్వసంరంభతం
గదియ న్వాసవ నీవు నీసురలు ఘూ
కప్రాయులై పోయి భీ
తి దలిర్పన్ హిమమేరుపర్వతగుహా
దేశంబులన్ డాఁగ న
య్యదనన్ యజ్ఞవరాహమై హరి హిర
ణ్యాక్షు న్వధించెన్ రహిన్. 301

వ. అనిన నింద్రుండు వరాహం బెచ్చట జనియించె నేకా
ర్యంబు సాధించెఁ దెలుపు మనిన బృహస్పతి యి ట్లనియెం.

చ. సలిలమునందు నొక్కయెడ
సంధిని గుమ్మరసారెవోలె ని
య్యిల భ్రమఁ జెందుచు న్మునుఁగ
నెంచి విరించి తనుం దలంచినన్

బాలుపుగ నవ్విధాత కను
బొమ్మలమధ్యమునన్ జనించె భూ
వలయసముద్ధరార్థి భగ
వంతుఁడు క్రోడకిశోరమూర్తియై.

ఉ. ఈనెటి నుద్భవించి జగ
దీశ్వరుఁ డంతఁ గ్రమక్రమంబునం
దా నతివృద్ధిఁ బొంది కల
ధౌతధరోన్నతమూర్తి యై జగ
న్మాన్యుఁడై రసాతల మ
మందగతిం దగఁ జొచ్చి యచ్చటం
బూని చరించుదానవునిఁ
బొంకమడంచె హిరణ్యలోచనున్.

తే. ఇట్టులఁగున హిరణ్యాక్షు నే పడంచి
యవని నవలీల నెత్తె నయ్యజపోత్రి
భువియుఁ దత్పాండుదంష్ట్రాగ్రమునఁ జెలంగెఁ
జంద్రమధ్యస్థనీలలాంఛనముకరణి.

తే. జలధు లేడును నక్కిటిస్వామిరోమ
కూప మొకటియు నింపఁగ నోప వయ్యె
నంత మన్వాయ మవనికి నవతరించి
ధృతి యథాపూర్వగతిఁ బ్రవర్తిల్లె రందు.

క. భూదారపరతఁ దనరియు
భూదారాకృతి వహించి పొదలెడుహరి చె
ల్వేది రసాతలగత మగు
నాదిరసాతలము నెత్తుటది చిత్రించే. 307

క. యజ్ఞవరాహముకథ విను
ప్రాజ్ఞులకు న్సంతుకృతవిపజ్జాల మెఱుఁగా
సుజ్ఞానకలితమతి స
ర్వజ్ఞత్వము గాంతు రెపుడు వనజాక్షుకృపన్. 308

క. అని గురుఁడు దెల్పె ననుచుం
వినుపించిన సూతుఁ గాంచి విస్మయవార్ధి
న్మునుఁగుచు ముని లవ్వలికథ
యనఘవచస్సరణిఁ దెల్పు మని యడుగుటయున్. 309

శా. నిర్వాణప్రమదామనోహర హారా
నీహారతారాసుధా
పర్వేందుప్రతిమల్లపాండురరుచి
స్ఫారాంగ వ్యాసాదికాం
తర్వాణిస్తుత సేవకార్తిజలజా
తవ్రాతజీమూత స
ద్గీర్వాణావళిమౌళికీలితమణీ
కిమ్మీరితాంఘ్రిద్వయా. 310

# ముఖ్య పాఠ భేదములు

| పుట. | పంక్తి. | పాఠభేదము. |
| --- | --- | --- |
| 14 | 16 | నొప్పారు |
| 87 | 3 | గతిగాఁ బలుకుట |
| 118 | 13 | వారికీ, యేవము |
| 134 | 14 | యాచించుటయును |
| 156 | 6 | చరియించుపోల్కి |
| 181 | 1 | నవియుఁ బుష్కరసమం బగుటఁ బుష్కరతీర్థ |
| 300 | 19, 20 | క. సుందరతరవరకంధర, మందర శిఖరీంద్రనిలయ |
| 338 | 9 | వజలు భవద్దయావైభవమ్మున, నెయ్యది ... ... దెచ్చెద. |
| 391 | 1, 2 | ధరాచ్ఛవిలోచన |